# శాకుంతలముయొక్క అభిజ్ఞానత



వి శ్వ నా థ సత్యనారాయణ

# శాకుంతలముయొక్క అభిజ్ఞానత

రచయిత

విశ్వనాథ సత్యనారాయణ

పబ్లిషర్సు:
వి. యస్. యన్. అండ్ కో.
మారుతీనగర్, విజయవాడ-4

పురాతనైః లాక్షణికైః సూచితా
కథాగతిః తైః రసలగ్న బుద్ధిభిః
కథాశరీరే సుకవీంద్ర శిల్పిభిః
నిగూఢ విన్యాస రుచిః ప్రకల్ప్యతే.

కస్యాశ్చిద్రమణీమణేః నయనయోః
దైర్ఘ్యంచ నాసాగ్రతా
గల్లశ్రీగత మాంసపిండ నియతిః
హాసాంతరుద్యద్భ్రమీ
సర్వే గూఢతయా భృశం ప్రకటయం త్యస్యాః
జను ర్గౌరవం
శీలం సాధుమనోఽంతరస్థిత రహః
శృంగార లీలారసమ్.

మహాకవేః కావ్యగతాశ్చ శబ్దాః
కేచిత్కథామర్మ భిదో భవంతి
కాదృక్కథాస్పృష్టిపథే నిగూఢ
మాణిక్యగోప్తా ఖలు కాళిదాసః

అన్యోఽన్య సంపర్క వల్గు కాంతిః
నిత్యప్రియంకరా దతి సూక్ష్మమార్గాః
కాకుంతలే క్లృప్తగిరః సమీక్ష్య
వినిర్మితిప్రౌఢి మిహాతనోమి.

మహాకవిః లోక శుభాభికాంక్షీ
మంత్రీవ గూఢార్థమతి శ్చకాస్తి
కాలాంతరే పక్వవచోఽర్థరాశిః
ప్రసన్నధారా మధురాభిభాషీ,

ఇయం వాగ్వ్యాగ్యేత్త్రపరితతిమతిసీతా యది భవేత్
తదా యత్నోఽయం మే భవతి భవభార్యామతిహితః
జగన్మాతుః తస్యాః పరమ కరుణా నిర్ఝరప్లవత్
సమాసేక శ్శ్రీమన్మధురతర జిహ్వాస్యచ కవిః.

౧

మహాకవుల శిల్పమునుగూర్చి వేలయేండ్లు పండితులు భావుకులు విమర్శకులు చెప్పుచునే వచ్చుచుండురు. మఱియు నేదో క్రొత్త విషయము మఱెవ్వనికో స్ఫురించ దను నియమము లేదు. ఈ యర్థములన్నియు నా కవి యుద్దేశించలేడు. ఇతని స్వకపోలకల్పితము లని చెప్పువారున్నారు. వారికి మహాకవుల వాక్కులలోని రహస్యము తెలియ లేదనవలయును. వాక్కు వెలువడును. అది యర్థసహితముగనే వెలువడును. దానిలో నున్న సర్వార్థములును వెలువడినవేళ దానిలో నిమిడియే యుండును. వాక్కు యొక్క రమణీయత దాని వెలువడుటలోననే యున్నది. ఆ వాక్కు నుచ్చరించినవాడు దాని యర్థము భావించెనా యన్న సందేహము వాగర్థముల యవినాభావ సంబంధ మెఱుంగనివారి కుండును. వాక్కు వెలువడుటకు పూర్వము బహిరాగమనము జరుపవలసిన స్థితిని భావించవలయును. వాక్కెందుకు వెలువడును? ఊరకున్నచో నరిపోదా? వాగ్వ్యవహారము లేకుండ లోకమునందు పరస్పర భావగ్రహణము జరుగుచున్నదని చెప్పుచున్నారుగదా! ఈ వాక్కు లేకుండ జరిగెడి వ్యవహారమునం దసంపూర్తియు వాక్సహిత వ్యవహారమునం దాధిక్యమును కలిమిచేత నకడా వాక్కునకు ప్రాధాన్యము వచ్చినది?

వాగర్థము లవినాభావసంబంధము కలవి. అర్థ మనగా నేమి? ఆ వాక్కు నుచ్చరించినవాని తత్కాలజీవస్థితిలో దద్వాక్సంబంధిగా నెంత యర్థము పుట్టగలదో యంత యర్థము సంగ్రహింప బడియుండుట. ఈ సంగ్రహింపబడుట క్రమశః వివృత మగును. వాగుచ్చరణ సమయమందు నది యుచ్చరింప బడుచున్నది. ఆ యుచ్చరించినవాడు తదర్థగతైకదేశ సమన్వయ పర్యాప్తబుద్ధియై యుచ్చరింపవచ్చును. అందుచేత బరిశిష్టార్థము దానియందు లేదనుటకు వీలున్నదా? ఒక డొక మాట నుచ్చరించును. వాడొక యర్థము నుద్దేశించి చెప్పును. రెండవవాడు తనకు గోపహేతువైన దానిలోని యింకొక యర్థమును దీసి వాని నాక్షేపించును. వాడు నా యుద్దేశ మదికా దనును ఇద్దరును దర్కించుకొందురు వాడు తన యుద్దేశ మదికాదనుట, వాని యుద్దేశ్యము కాని రెండవ యర్థమును దీసికొని వివాదపడుట లోకమునం దున్నది. దీని తాత్పర్యమేమనగా వాక్కు బహ్వర్థకము. ఆ వాక్కెవని నోటినుండి వచ్చినదో వాడు దాని నుద్దేశించకుండగనే యొకటి వాగ్గత శక్తిచేత, రెండు ఉచ్చరించినవాని జీవగత శక్తిచేత దానియందు బహ్వర్థసంగ్రహణము జరిగియుండును, ఉద్దేశించుట యనగ నేమి? వాక్కెచ్చటినుండి వచ్చుచున్నది. వాక్స్వరూపమేమి? బహిరాగమన వాంఛాసహితమైన జీవైకదేశవృత్తి వాక్కు. ఉద్దేశించుట యనగా నేమి? వ్యవహారాపతితమై తత్కాల ప్రయోజనవాంఛ వ్యక్తీకరించుట యందలి భావము. వాక్కుయొక్క యర్థమునకు నీ రెండు భాగములు కలవు. ఆ వ్యవహార దశయందు రెండవదానికి ప్రాధా

న్యము. వాగర్థము వాగర్థమని చెప్పుటకు రెండు భాగములు ప్రధానములే.

కావ్యమునందు కావ్యగతవస్తు పురస్కృతమై ద్వితీయ భాగమునకు ప్రాధాన్య వివక్ష కలిగినను గావ్యమున కాత్మ ధ్వని కనుక, ధ్వని యనగా వాచ్యాతిశాయియయిన సర్వార్థము కనుక, వాక్కు-యొక్క సర్వార్థము కావ్యమునందుండును. దీనిని యుద్దేశించినాడా లేదా యన్న ప్రశ్న యుండదు. ఉద్దేశమనగా తదర్థగతాంశ యుచ్చారణసమకాలమందు మనస్స్పృష్టమై యున్నదా లేదా యన్నది. మన స్స్పృష్టము కానంతమాత్రముచేత దద్గత పరిశిష్టార్థము తదుచ్చారణప్రవర్తకమయిన జీవసంకల్పమునందు లేదనుటకు వీలులేదు. తజ్జీవసంకల్పమంతయు తద్వాగర్థము ఆ సంకల్పము యొక్క మహాపరిణామము ఋషుల కుండును. తత్తుల్యులైన మహాకవుల కుండును.

మన పురాణములయందు ఋషుల శాప సందర్భములందు దీని యర్థము సువివృతమైయున్నది దీనిని భవభూతి—

లౌకికానాం హి సాధూనా మర్థం వాగనువర్తతే
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోనుధావతి.

అన్నాడు. ఈ శ్లోకమునందు వాక్కు—అర్థము అన్న రెండు మాట లున్నవి. ఈ రెండుమాటలను గలిసి రెండుచోట్ల

నున్నవి. రెండుచోట్ల నున్న వాక్కున కొకటే యర్థము కాదు. రెండుచోట్లనున్న యర్థమున్న శబ్దమున కర్థ మొకటి కాదు. ఆ మాటలలో మొదటిది లౌకికులైన సాధువులకు సంబంధించినది. రెండవది ఆద్యులయిన ఋషులకు సంబంధించినది. లౌకికులైన సాధువులు లౌకికమైన యర్థము నుద్దేశించి శబ్దముకు ప్రయోగింతురు ఆ వాక్కు నాయర్థము నొక్కటి ఆ వాక్కునం దన్యార్థమునకు ప్రాధాన్యము లేదు. ఆద్యులయి ఋషులు వాక్కును ప్రయోగింతురు. ఆ వాక్కు యొక్క యర్థము దాని సర్వార్థమునై యుండును. లౌకికమును పారలౌకికమును త్రైకాలికమునునైన సర్వార్థము వారి వాక్కునం దుండును. లౌకికానాం హి సాధూనాం వాక్, ఋషీనాం పునరాద్యానాం వాక్. ఆ వాక్కులు వారివారివి. వాక్త్వ నియమము కలదు. విశేషణత్వోపహితమై తద్వాక్త్వము నియమిత మగుచున్నది. పురాణములయందలి ఋషుల శాపములు తీసికొన్నచో దీనియర్థము మఱియు సువిస్పష్టమగును. దీని విస్పష్టత శ్రీనాథకవి రచించిన హరవిలాసావతారికలో చక్కగా గలదు. దుర్వాసుడు తన యాశ్రమము ముందట తాను పెంపుకులేడికి పచ్చిగడ్డిపఱకలనందించుచుండెను. వెంట నేగు నొక గంధర్వుడు ముద్దువచ్చి చిటిక వేసెను. దుర్వాసునకు కోపమువచ్చి యా గంధర్వునిమనుష్య జన్మ మెత్తుమని శపించెను. అతడు వచ్చి ముని కాళ్ళ వ్రేళ్ళబడెను దుర్వాసునకు జాలికలిగెను. "ప్రొద్దునలేచి రూవని మొగము జూచితివిరా, నాయనా! ఇంతమాటబడినావు, నీ భార్యను బిడ్డవలె నా యాశ్రమములో నుంచుకొని చూచు

చుండును. నీవుపోయి యా తిట్టుఫలమును తీర్చుకొనిర"మ్మని పంపినాడు దీనిలోని పరమార్థ మిది. అది యా గంధర్వుని నొసట వ్రాసియున్నది. వానికర్మ యిటువంటిది. ఇదిశాపము కాదు. ఆ గంధర్వునియొక్క కర్మానుభవము. జరుగవలసిన నిముసము వచ్చినది. దుర్వాసుని నోటివెంట వచ్చిన యా మాట యా యనుభవవేళయొక్క పరమ సన్నిహితత్వ ప్రదర్శకమైనది. తదనుభూతి ప్రారంభించుటకు సద్యఃకారణ మైనది. ఒక్కొక్క మాటయొక్క యర్థ మిట్లుండును. ఇంత చెప్పుట యెందుకనగా మహాకవుల కావ్యములలో నిట్టి వాక్యము లుండుచు. వాక్కు లుండును. ఋషులవాక్కు సాధువులవాక్కు అనుటచేత వాక్కున కర్థము అచ్చట వేఱయినట్లు కవులయొక్క కావ్యముల యందలి కొన్ని మాటలు సందర్భముచేత చిత్రవిచిత్రములైన యర్థము లిచ్చుచుండును.

ఒక సంగతి, మన సంస్కృత నాటక కర్తలు శబ్దము యొక్క యీ మహార్థపరిణామము తెలిసినవారు. తమనాటక రచనా శిల్పములో నీ మహార్థమున కెక్కువ స్థాన మిచ్చిన వారు. నాటకము—అనగా రూపకము కావ్యవిశేషము కావ్య విశేషమయిన యీ నాటకముయొక్క నాటకత్వము, అనగా అది నాటక మగుట కొన్ని లక్షణములను పురస్కరించుకొని, పూర్వ సంస్కృత మహానాటక కర్తలు రూపకరచనా వ్యగ్రులయిరి. వారి నాటక రచనాశిల్పముయొక్క మూల స్తంభము వీరాదృతమైన యర్థము. ఈ యర్థమునే వివరించి

లక్షణకర్తలు కూడ నాటకాంగములుగా చెప్పిరి. కాళిదాస భవభూతులు ఆ నాటకాంగములు చాలవన్నట్లు తమ మహా నాటకములను సర్వత్ర యీ మహార్థము చేత నిండియుండునట్లు చేసినారు.

భారతీయ సంస్కృత నాటక మనగా నిది. ఏ యర్థము భూతభవిష్యద్వర్తమానములం దభివ్యాప్తమయి భిన్న పరిస్థితులయందు ననుస్యూతమై కర్మసూత్రముచేత పరస్పర సంబంధ లక్షణములు కలిగియుండునో యా యర్థము మీద నా మహాకవులు నాటకములను నిర్మించిరి. ఇది భారతీయ సంస్కృత నాటక మూల రహస్యము.

ఈ రహస్యమును వివరించుటలో కాళిదాసు పోయిన మార్గము వేఱు, భవభూతిపోయిన మార్గము వేఱు. కాళిదా సింతకంటె మఱియు పరమరహస్యములను దన కావ్యమునం దిమిడించినాడు. నా బుద్ధికిఁదోచినంతవఱకు వానిని వివరించుటకే యీ గ్రంథరచన యారంభించుట యైనది. మఱియు నింకొక్క విషయము కలదు. నా వ్రాయుచున్న యీ వ్యాసములలోని పలువిషయములు పూర్వులయిన వ్యాఖ్యాతలు వ్రాసియుండవచ్చును భావుకులు భావించియుండవచ్చును. 'చాపలాయ ప్రచోదితః', కాదేని కొన్ని క్రొత్తవిషయము లుండవచ్చును. ఉన్నను నవి ప్రభువైన కాళిదాసు వాక్కులోనున్న యర్థములే.

ఇంత మహార్థము గాలిలో నుండదు. వస్తువు నాశ్రయించి యుండును. వస్తువు లోకమునందున్నది. వస్తువుదాత్త

మైనచో దానియందు బహ్వర్థములు సహజముగా నిమిడి యుండును. ఆ వస్తువు నాశ్రయించి మహాకవి క్రొత్త కల్పనల జేసియుండును. ఆ కల్పన యొక్క రమ్యత వాని యౌచిత్యమునందుండును గదా! ఔచిత్యమనగా నుచిత మైనవానియొక్క భావము. ఉచితమనగా తగినది. దేనికి తగినది? ఆ కథకు తగినది. అనగా సరిపోయినది. అనగా దాని యందున్నదే - అప్పుడు క్రొత్తగా జూచినదని యర్థము దానిని జూచుటకా మహాకవియొక్క బుద్ధి కావలసి వచ్చినది కనుక నొక మహా విషయములోనున్న సర్వార్థములు మహాబుద్ధికే స్ఫురించును. సర్వార్థము సర్వజనులకు స్ఫురించవలసిన యవసరము లేదు. ఒకడు తనకా యర్థము పూర్వము స్ఫురించక మరియొకడు దానిని జెప్పినప్పుడు వాడు దానిని కల్పించి చెప్పినవాడనుటలో దాని యౌచిత్యము వానికప్పుడు తెలిసినది. తనంతటతనకు తెలియలేదన్న మాత్సర్యమున్నది.

కవి యొక్క కథను దీసికొని కావ్యమును వ్రాయును. సామాన్య కవియొక్క కథావస్తువు ఆ కావ్యములోనున్న సామాన్యవస్తువే యగును. ఆ కథనే మహాకవి తీసికొన్నప్పుడు ఆ కథలో నెన్ని యర్థములుండునో యన్ని యర్థము లతనికి కావ్యవస్తువులే. వాగర్థముల విషయములో పూర్వము చెప్పిన విషయ మంతయు నతడు నాటకము వ్రాయుచున్నచో కావ్యవస్తువగును.

కవియనగా నెవడు? ఈ మహార్థములను శిల్పదృష్టితో

జెప్పువాడు. శిల్పదృష్టి బహుముఖముగా నుండును. ఈ మహార్థములన్నియు దన కావ్యమునం దిమిడించుట యొక శిల్పము. వానిని సముచితముగా నెచ్చట నేది చెప్పవలయును, ఎట్లు చెప్పవలయును, ఆద్యంతములెట్లు, అభ్యాసమెట్లు – ఈ విచారణ యంతయు జేసి యా ప్రకారము చెప్పుట యొక శిల్పము. ఇందులో ననేకములైన చిన్న చిన్న విషయము లుండును. అవి యీ మహాప్రవాహములో లీనము కావలయును. వాని నెట్లు చెప్పవలయును? ఇది యొక శిల్పము.

ఇవి యిట్లుండగా దాను వ్రాయుచున్నది కావ్యము. కావ్యము కథాశ్రయము. కథా స్వరూప మెట్టిది? తన కథ యొక్క స్వరూప మెట్టిది? తనకావ్యమునం దేరూసము ప్రధానము? ఆ రసముయొక్క స్వరూపమెట్టిది? ఒక విచారణయా? అన్నిటిని గలిపి కాళిదా సొక్క మాటలో వ్రాయును. ఒక్క పద్యములో నన్ని యర్థములు గుమికూడి యుండును. చెప్పికొనవలసి వచ్చినపు డొక్కొక్కదానినే, యొకదాని తరువాత నొకటిగా జెప్పికొనగలముగాని యన్నిటిని గలిసి చెప్పలేము, అన్నిటిని గలిసి చెప్పగలిగినది కవి వాక్యము. విడివిడిగా చెప్పునది విమర్శకుని వాక్యము. కవి వాక్యములోని యీ సర్వార్థము నొక్కసారి భావుకునకు స్ఫురించును. విమర్శకుని రచన పాఠకులకు దెలియును.

ఒక విధముగా శాకుంతల నాటకము 'గ్రీవాభంగాభిరామం' అన్న శ్లోకములో ప్రారంభించిన దండము. ఈ శ్లోక

ములో కాళిదాసు తన యీ స్వకావ్య స్వరూపము చెప్పి యుండవలయునుగదా.

అతని కావ్యము నిజమునకు తత్పూర్వమే ప్రారంభింపబడినది. 'కృష్ణసారే దదచ్చక్షుః' అన్న శ్లోకముతోనే యారంభింపబడినది మఱియు మాటాడనచో 'యా సృష్టి స్స్రష్టు రాద్యా' యన్న శ్లోకముతోనే యారభింపబడినది. 'కృష్ణసారే దదచ్చక్షుః'లో నీ సర్వ వాగర్థముల కతీతములైన పరమార్థ విషయమును కాళిదాసు తన కావ్యార్థమునకు ఖండాయమానముగా జెప్పదలచిన మహా విషయమును సూచింపదలచినాడు. ఆ మహా విషయమున కాలంబభూతుడైన యీశుని. యష్టతనుని 'యా సృష్టిస్స్రష్టురాద్యా'లో నిక్షేపించినాడు.

కొంత క్రిందికి దిగి కావ్యారంభము చూచినచో 'గ్రీవాభంగాభిరామమ్' అన్న శ్లోకము కావ్యారంభము. సారంగము గ్రీవాభంగాభిరామముగా స్యందనమునందు బద్ధదృష్టియై యనుసరించి పరువెత్తుచున్నది. శరపతనభీతిచేత నెక్కువగా పూర్వకాయము పశ్చార్ధముచేత ప్రవిష్టమైనది. శ్రమవివృతముఖభ్రంశము లయినవి, యర్ధావలీఢములు నయిన దర్భలచేత దారియంతయు వెదజల్లబడియున్నది. ఉదగ్రప్లుతముల చేత నా లేడి యెక్కువగా వియత్తునందును దక్కువగా భూమియందు బోవుచున్నది. ఇందులో సారంగము గ్రీవ, స్యందనము, పశ్చార్ధము, కాయము, శరము, వియత్తు, ఉర్వి-యీ శబ్దములు కలవు.

ఈ శబ్దములే యేలయుండవలయును? సంస్కృత భాషలో పర్యాయ పదములు కొల్లలుకొల్లలుగా నుండును గదా, సంస్కృతభాషా శబ్దములు వ్యుత్పత్తి సహితములైనవి. ఎక్కువ శబ్దములు ధాతుజన్యములు, కొన్ని భిన్నావయవములయొక్క యర్థపోషకములు అందుచేత ప్రతి శబ్దమునకు యౌగికార్థము రూఢ్యర్థము రెండునుండును సామాన్యముగా కవి తన కావ్యరచనకు రూఢ్యర్థమునే స్వీకరించవలయును గదా. (యోగార్థములో శబ్దములను ప్రయోగించినచో నేటి కొందరు విమర్శకులు తిక్కన్నగారు వ్రాసినమాటనే వ్రాత వడ్డ మాటను అన్నదానిని దెచ్చి హింసించుటకలదు. వ్రాత వడ్డ మాటలని తిక్కన్నగారు. విరళాన పేచోపాదిక శబ్దాన్ అని నన్నయగారు. ఇది వేఱేవిషయము )

మహాకవులు సామాన్య పాఠకునకు స్థూలకథావస్తువునకు శబ్దమును రూఢ్యర్థములో ప్రయోగించుచు దాముద్దేశించిన మహార్థములను లోతుగా దిగిచూచెడి పాఠకులకు వాని యౌగికార్థములలో సంతరింతురు. కాళిదాసుయొక్క సర్వ రచనయందు నీ ప్రయోగరహస్యమున్నది. నా చూచినన్ని చోట్ల అయన కావ్యములందు గనిపించినది. శాకుంతలము నందు లేనితావులేదు. అతని కావ్యములన్నియు తత్ర తత్ర యీ దృష్టితో జూచితినికాని సర్వాంకషముగ జూడలేదు. శాకుంతలమునందు పెక్కుచోట్ల జూచితిని. సర్వత్ర యీ వైచిత్ర కనిపించుచునే యున్నది. సారంగ శబ్దమునకు రెండు వ్యుత్పత్త్యర్థములుకలవు. సారమైన యంగములు కలది యని యొకటి. తన జాతివానితో గలసి విహరించునదియని మఱొ

కటి. తన కావ్యవస్తువు సారమైయున యుంగములు కలసి సజా తీయ భావములతో గలసి వ్యవహరించినది. అతని కావ్యవస్తు వేది! అతని వస్తువు బహుముఖములుగాగలదు. ఒకటి శివ స్వరూపమును జెప్పుట. రెండు అంతఃకరణ లక్షణమును జెప్పుట. మూడు సత్పురుషు డెట్టివాఁడో నిర్ణయించుటః నాల్గవది శృంగార రసముయొక్క కట్టుదిట్టములు నిరూపిం చుట ఐదవది శకుంతలా కథ ఆఱవది నాటక స్వరూపము, ప్రధానముగానివి కనిపించుచున్నవి. సారంగమన్న శబ్దము- వీని యన్నింటికి బదులు ప్రయోగింపబడినది. గ్రీవా—అన్నాది కములు దీనిచేత మ్రింగబడును-అని వ్యుత్పత్తి. వ్యుత్పత్త్య ర్థవశమున లక్షణ ప్రాపించినచో స్ఫురణశక్తి యర్థము వచ్చును. స్యందనము-రథము, స్రవింతునది. కథ స్రవించును రసము స్రవించును, జీవితము స్రవించును ఏదికాదు! శరము- హింసించున్నది కనుక శరము ఒక యోషధియందు బాణము నందు నీ శబ్దము వర్తించుచున్నది. వ్యుత్పత్తి రెండుచోట్ల నొక్కటియే. ఇచ్చట 'నీకావ్యమును విమర్శించివారు' అను నర్థమును జెప్పవచ్చును ఎందుకు జెప్పవలయుననగా నీకావ్య మిట్లెందు కారంభింపవలయును! ఏరీతిగానో యొకరీతిగా నారంభింపవలయునుగదా. ఇది రమ్యముగానే యున్నదియన్న సమాధానము చాలదు. శిల్పముయొక్క ప్రధాన లక్షణము ప్రయోజన సహితత్వము అధికార్థసంగ్రహణము. పాఠకుని గాఢభావనాశీలుని జేయునది, కాయమ్-అవయవముల చేత

గూర్చబడునది యని వ్యుత్పత్తి కావ్య మిటువంటిది, దానికి మొదలున్నది. చివరయున్నది. నడుమున్నది. అన్ని యవయవ ములు కలవు. బాణముపడునన్న భీతిచేత లేడి తన పూర్వ కాయమందు వెనుకటి శరీరమును జొప్పించుకొన్నది. తన కావ్యము శీర్ణమైపోవునని తన శత్రువులు కావ్యమునందు సంయోజన గుణము తక్కువ యందురని తరువాత కథ యంతయు కాళిదాసు నాటకముయొక్క పూర్వభాగము నందు దాను జొప్పించినాడు. ఈ లేడి తన కావ్యవస్తువు. తన కావ్యవస్తు వన్నివిధములు. ఈ మాటచేత నాట కాంగములయిన సూచనాదులన్నియు దీనియంతర్భూత ములైయున్నవి. ఈ లేడి వియత్తునం దెక్కువ యుర్వియందు దక్కువకదా! వియత్తునకు 'ఎడతెగక యుండునది. యని' వ్యుత్పత్తి. ఉర్వికి బర్వతములచేత గప్పబడినది. యని వ్యుత్పత్తి, తనకథ యధికమైనది యాకాశము సందునది- అంతటను వ్యాపించియున్నట్టి ఇదివట్టిశృంగార రసమయినను ననంతమైనదే. అది శాకపరమేశ్వరుడు, జీవుడు, సర్వ జీవ కోటియందు మేల్కొనియున్న యంతఃకరణము. ఇది యతని కావ్యవస్తువు ఇవికాక తన కావ్యకథ మొదట చివరగూడ నరణ్యములలో గొండలలో జరిగినది లేదా దుర్గమార్గము కలది.

మఱియు నీ సారంగము మెడవంచి స్యందనమును జూచుచున్నది. చూచికొంచునే పరువెత్తుచున్నది. ఈ కథ యంతరము కనిపించకపోవుటచేత వెనుకకు తిరిగినది. కాని కథనుజూచుట వదలిపెట్టలేదు. రకరకములుగా జూచుచున్నది

“బలవత్తు దూయమానం ప్రత్యాయయతీవమే హృదయమ్” మర్త్యేవవిస్మరణ దారుణ చిత్తవృత్తౌ” ఇట్టి యర్థములచేత వెనుకకు జూచుచున్నది. కథావస్తువైనచో నిది జీవలక్షణ మయినచో ‘సతాంహి సందేహపదేషు వస్తుషు’— ‘కదాపి సత్పురుషా శోకపాత్రాత్మానో న భవంతి— ‘నను ప్రవాతేపి నిష్కంపాగిరయః’— ‘యథాగజో నేతి సమక్షరూపే’— ఇత్యాది వాక్యములచేత నాయంతః కరణ ప్రవృత్తి యొక్క— జీవగత లక్షణము సత్పురుషుని యందున్న యంతఃకరణము. జీవస్పందన మార్గమును వెనుకకు తిరిగి చూచికొనుట మొదలైనవి చెప్పబడుచున్నవి.

అన్ని రకములలో శృంగారరస నిర్వాహణము క్లిష్టాతి క్లిష్టమయినది. శృంగార రసమునం దుదాత్తత నిలువబెట్టుట కాళిదాస భవభూతులకే తగునేమో. నిముసములో కచకు చాది వర్ణనముల క్రిందికి దిగును. ఈ శాకుంతల నాటకమును ప్రదర్శించుచు కాళిదాసుని యౌచిత్య మెఱుగక బజారు శృంగారము చేయబడుటయు నే నెఱుగుదును. ఇటి శృంగార రస ప్రాధాన్యముగల తన కావ్యమును నాయికా నాయక ప్రథమ సమావేశ భూతమైన ప్రథమాంకమును కాళిదాసు ఇన్ని బహ్వర్థముల నుద్దేశించి రాజు లేడిని దఱుముటతో ప్రారంభించెను. ఆ లేడి కృష్ణసారము కృష్ణునియొక్క సారము. భగవంతుడైన కృష్ణునిచేత జెప్పబడిన గీతోపనిషత్తు యొక్క సారమా! రాజెట్లున్నాడు! సూతున కతడు మృగానుసారియైన పినాకివలె గన్పించుచున్నాడు. మృగ మనగా వెదుకబడుచున్నది! ఏది వెదుకబడుచున్నది. తత్త్వము.

అంతఃకరణాంతర్గత సూక్ష్మభావభూతజీవస్వరూపము. తత్ప్రే రేపకుడైన శివుడు.

కాళిదాసుని అభిజ్ఞానశాకుంతలము సర్వవేద వేదాంత సారము శివాద్వైత ప్రతిపాదక గ్రంథము.

౨

పరుగెత్తుచున్న లేడి పట్టి లేడియేకాక, చాల యర్థము లకు నిధానముగ నూహింపబడుటలో నొక యర్థము కావ్య వస్తువనికూడ తెలిసికోబడవలయుట చెప్పబడినది. ఇందు రెండవ చరణము "పశ్చార్ధేన ప్రవిష్ట శ్శరపతనభియా భూయసా పూర్వకాయం" అన్నదానిలో కథా గత తాత్ప ర్యము సువ్యక్తముగా కనిపించుచున్నది. శరపతన భీతిచేత వెనుకటి సగము ముందు సగములో జొచ్చుకొన్నది అని. ఈ శ్లోకమైనంతనే "కథ మనుపతత ఏవ మే ప్రయత్న ప్రేక్ష ణీయ స్సంవృత్తః"అనుసరించుచునే యున్నాను.ప్రయత్నము చేసినగాని కనిపించుటలేదు. అనగా చాలదూరముపోయినదని యర్థము. ఈయర్థము లేడి విషయములో కంటె శకుంతలా

విషయమున నెక్కువ నిజముగా నున్నది. రాజు శకుంతలను చూచినాడు. ఆమెయం దనురక్తుడైనాడు. ప్రియంవదానసూయలు వివాహసంబంధి ప్రసంగము చేయువరకు నామెయందు బద్ధమనస్కుడైనాడు. 'ఇదం కిలావ్యాజమనోహరం వపుః' -'సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం'- 'అధరః కిసలయ రాగః' ఈ మొదలయిన ప్రవృత్తి చాల వరకు సాగినది. అప్పుడు శకుంతలతో అనసూయ వనజ్యోత్స్న కథ ప్రారంభించినది. ప్రియంవద "యథా వనజ్యోత్స్నానురూపేణ పాదపేన సంగతా ఏవం నామాఽహమపి ఆత్మనోఽనురూపం వరం లభేయమితి" ఈ యూహతో శకుంతల వనజ్యోత్స్నను అతి మాత్రముగా చూచుచున్నదని ప్రియంవద చమత్కరించినది. శకుంతల దానికి సమాధానముగా "ఏష నూనం తవాత్మగతో మనోరథః" ఇది నిజముగా ని మనస్సులోనున్న కోరిక అని- 'ఇతి కలశమావర్జయతి'- ఇది నీ మనస్సులోని కోరికయనగా లోకసామాన్యముగా జూచినచో నీకు దగిన భర్తను సంపాదించుకొనవలెనని నీవే కోరుచున్నావు నాకట్టి కోరికలేదు. అని వ్యతిరేకార్థము నిచ్చుమాట. కాని శకుంతల అనురూపవరుని పొందవలయునని ప్రియంవద వాంఛించుటయు నిజమే. అంటివాంఛ ప్రియంవదకు కలదని శకుంతలకు తెలియును. శకుంతలమాటలన్నియు లజ్జచేతవలె. అసూయచేతవలె నన్నట్లు కనిపించి యామె హృదయగతవాంఛను తనయందాచలేక తెలుపగల యనురాగమును సూచించుచున్నది. ఈమాట యని శకుంతల కుండెడు నీళ్లు వనజ్యోత్స్నయొక్క యాలవాలమున నింపి

నది. కోపము వచ్చినప్పుడు మానవు లిట్లే చేయుదురు. కొంచెము నీళ్ళు పోసినచో జాలునేమో, కుండెడు నీళ్లు చ్చుటనే రొలికించినది. ఈ క్రియచేత కవి శకుంతలయొక్క సర్వమనోభావమును వ్యక్తీకరించినాడు ఆమె తన సర్వస్వము తన భర్తకర్పించె నన్నట్లుగా నీకలశావర్జనము మహాధ్వని నిచ్చుచున్నది.

అంతవరకు తత్సౌందర్యచర్చా నిమగ్నుడైన రాజునకు దానిలోని క్లిష్టత తెలియలేదు. ఈవివాహ ప్రసక్తి వచ్చుటయు, శకుంతల కలశావర్జనము చేయుటయు రాజునకు జాగ్రదవస్థా హేతుకములైనవి. అప్పుడు "దుర్లభః ఖల్వేష మనోరథః అపి నామ కులపతేరియ మసవర్ణక్షత్రసంభవా స్యాత్" అన్న సందేహము పుట్టినది. ఇది నిజముగా గడ్డ సమస్య. ఇంతవరకు సాగిన ప్రవృత్తికి విచ్ఛిత్తిస్థానము. ఈ యర్థమునే ఈ సంశయమునే ఈ ఘట్టమునే, "కథ మనుపతత ఏవయమే ప్రత్యుపేక్షణీయ స్సంవృత్తః" అన్న వాక్యము చెప్పుచున్నది. "అనుపతత ఏవ మే" అనగా నా మనస్సు తదభిలాష పరివర్తిత మగుచుండగా నామె ప్రత్యుపేక్షణీయ రాలగుచున్నది, ఆమె జన్మవృత్తాంత రహస్యము తెలియక నేనామెను వివాహమాడలేను. ఆమె క్షత్రపరిగ్రహ యోగ్యగాదు. అన్న సంశయము ప్రత్యుపేక్షణీయముగా చెప్పబడినది.

అప్పుడు సూతుడు "ఉత్ఖాతినీ భూమిరితి మయా రశ్మిసంయమనా ద్రథస్య మందీకృతో వేగః తేన మృగ ఏష విప్రకృష్టాంతర స్సంవృత్తః. సంప్రతి సమదేశవర్తి నస్తే నదురాసదో భవిష్యతి." భూమి మిట్టపల్లములుగా నున్నది. అందుచేత రథ వేగమును తగ్గించినాను. మృగమునకు నీకు నడుమ దూరము మెండైనది. ఇప్పుడు నీవు సమదేశమున నున్నావు. అది నీ కిప్పుడు దురాసదముగాదు. భూమి ఇచ్చట నుత్ఖాతిని. ఈవాక్యముయొక్క యర్థమే "అపినామకులపతేరియ మసవర్ణ క్షేత్రసంభవా స్యాత్" అన్నది. తాను క్షత్రియుడు. ఆమె బ్రాహ్మణ స్త్రీ. ఇద్దరినడుమ వివాహము ధర్మముగాదు, ఇది మిట్టపల్లములని చెప్పబడుట. బ్రాహ్మణ వర్ణము కొంచెము మెరక. క్షత్రియవర్ణము కొంచెము పల్లము శకుంతలానాగభిలాషారూపమైన శృంగార రసమునకు ప్రచలనము తగ్గినది. సూతుడు రశ్మిసంయమము చేసినాడు. ఈ సూతుడు బ్రహ్మయా! నాటక గత వక్త్రనపేక్షయా ధ్వని ప్రవర్తించవచ్చును. కాని 'మయా మన్దీకృతో వేగః' నేను వేగమును తగ్గించినానని సూత ప్రాధాన్య వివక్షచేత ధ్వని ప్రవర్తించినను. దానియందు కొంత వెనుకకు లాగుట జరుగవచ్చును. అందుచేత సూతునకు గూడ కొంత ప్రాధాన్యమీయవలెను. ఆ ప్రాధాన్య మెట్టిది! ఈ ప్రాధాన్య మీమాంస చమత్కారముగా నుండవచ్చును.

ఇక్కడ ధ్వనికిని కావవస్తువునకును అభేదప్రతిపత్తి. ప్రస్తుతము రథవేగము; అప్రస్తుతము శకుంతలా జన్మవిషయము

వృత్తాంత విచారణ. కొద్దిలో నదియు జరుగబోవుచున్నది. దానికి మాటలు ప్రతిబింబములుగా నున్నవి. దీనియందది ధ్వనిత మగుచున్నదని చెప్పుటయే కాని వ్యంగ్య వ్యంజక పరమ సన్నిహితత్వ సన్నికరలచేత నభేద ప్రతిపత్తి భ్రాంతి గల్గుచున్నది. ఇదిగో ఇప్పుడు సమప్రదేశమును చేరినావు. నీ కా మృగము దురాసదముగాదు రశ్మి సంయమనము చేసినది సూతుడు. సమప్రదేశము చేరినది దుష్యంతుడు. అది మృగము. "మృగ్యత ఇతి మృగ." శ్రీ వెదుకదగినది. "న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్", శ్రీరత్నమైన యీ భావము కాళిదాసుని మనోనిష్ఠితమైనది. మృగశబ్దముచేత శకుంతల సూచింపబడుచునే యున్నది. భూమియొక్క యుత్ఖాతినీత్వలక్షణమునకు దుష్యంతునకు సంబంధము లేదు. మృగము విప్రకృష్టాంతరమైనది రశ్మి సంయమన మనగా వ్యంగ్యత: ఈమె క్షత్ర పరిగ్రహయోగ్య యగునా కాదా యన్న విచారణ కావలయును. అనగా శకుంతలా దుష్యంతుల భిన్న వర్ణత్వము భూమియొక్క మెరక పల్లములైనచో మృగశబ్దముచే శకుంతల సూచితమైనచో రశ్మిసంయమనము తద్గత మీమాంస కావలయును. సమప్రదేశ వర్తిత్వము ఆమె విశ్వామిత్ర సంభవ అని తెలియుట యగును. అప్పుడు మెరక పల్లములు లేవు కాని రశ్మిసంయమనము చేసినది సూతుడు. సమప్రదేశవర్తియైనవాడు రాజు. రథము సమప్రదేశ వర్తి యని చెప్పరాదా? నేను పగ్గములు బిగపట్టితినని చెప్పుట యెందులకు? పగ్గములు బిగబట్టబడినవి. అని వాక్యమును

కర్త్రైన పేరుముగా వాడవచ్చును. అందుచే నిచ్చట సూతు డొక్కడున్నాడు. రాజొకడున్నాడు. ఆగామి కథ దీనియందు సూచ్యమైనచో సందేహము కలిగినది. రాజునకే. సందేహము తీరునది రాజునకే. అక్కడ నిద్దరు రాజులులేరు. కాని యిద్దరు రాజులున్నారు.

ఈ నాటకమంతయు నిద్దరు దుష్యంతులమీద నిర్మింప బడినది. ఒకడు సామాన్యుడై లోకమునందు ప్రవర్తించు వాడు. రెండవవా డసామాన్యుడై యంతఃకరణమునందు జాగృతుడై ప్రవర్తించువాడు. రశ్మి సంయమనము చేసినది సూత స్థానీయుడైన రాజు అనగా విచారణ శీలుడైన రాజు. అనగా బ్రహ్మ. మనస్సును సృష్టించినవాడు. సమ పరిదేశ వర్తిత్వ లక్షణ స్థాపకుడైనరాజు శివుడు ఆయనయు నున్నాడు. అతడన సర్వనియంత, ధర్మమార్గోపదేష్ట. ఈరీతిగా సూతుడు సూతుడుగాడు. సూతునకు రాజునకు నభేదాధ్యవ సాయము.

అపుడు రాజన్నాడు, అందుచేత పగ్గములు వదలుము (తేన హి విముచ్యన్తా మభీశవః) శకుంతల విశ్వామిత్ర సంభవ యని తెలిసినంతనే శృంగారరసము ప్రవర్తించుచున్నది. కథ సాగుచున్నది.

ఆ కథ యెట్టిది? సూతుడు రథవేగమును నిరూపించు చున్నాడు.

ముక్తేషు రశ్మిషు నిరాయత పూర్వకాయాః
నిష్కంపచామరశిఖా నిభృతోర్ధ్వకర్ణాః
ఆత్మోద్ధతైరపి రజోభి రలంఘనీయాః
ధావన్త్యమీ మృగజవాక్షమయేవ రథ్యాః.

రశ్ములు వదలిపెట్టబడగా -రశ్మి యనగా వ్యాపించునది అని వ్యుత్పత్తి ఈభాగములోనున్న యర్థములు కావ్యమునందతటను వ్యాపించునని యర్థము. ఈకావ్యాపక సబ్ద సముదాయ నిక్షేప గ్రంథాంతమునందు అని యర్థము. అనగా శకుంతల తిరిపరిగ్రహయోగ్యయని దుష్యంతునకు దెలిసిన తరువాత, రథ్యాః-గుఱ్ఱములు. రథ్యములనగా రథమునకు కట్టబడునవి. రము క్రీడాయాం. ఆ రథ్యము లిచ్చట కర్త. అవి పగ్గములు సడలిన తరువాత నిరాయత పూర్వకాయములై - ఇందాక లేడి పశ్చార్థేన ప్రవిష్ట శ్శరపతన భియా భూయసా పూర్వకాయః- దానికిది వ్యతిరేకమైనమాట. నితరాం దీర్ఘస్య పూర్వభాగాః ఏషాంతే తత్సంశయు నివృత్తివరకు నన్నియు నిక్కెల్లో. ప్రతిదియు సందేహామే. తరువాతి కథయంతయుతీసికొనివచ్చితో బంతటి కథగో చొపించవలసి వచ్చినది. ఇంకముందుటికథ దానియంతటనని యధేచ్ఛముగా సాగును. ముందటి కథలో వెనుకటి కథయొక్క చొప్పింపు లేదు. అందుచేత యథేచ్ఛముగా పోవును. మరియు నంతియేగాదు. ఆ పూర్వకథనువిస్తరించును. అనగానాటకముయొక్కస్వరూప మేమనగాపరభాగము పూర్వభాగమునందుజొచ్చియుండుటయు ఆ పూర్వభాగముయొక్క విస్తృతియే పరభాగమగుటయు. ఈ

రథ్యములు మరియు నిభృతోర్ధ్వ కర్ణ[illegible]లు. Aతర్ణ[illegible]నగా శబ్దగ్రహణము చేయునది. లేదా శబ్ద[illegible]స్థానీయందుండుట అది ఆకాశ స్థానీయము గనుక. మరియ[illegible] చేత లేపబడిన రజములచేత గూడ నలంఘనీయములు ర[illegible] రంజయతీతి రజః. రంజ రాగే-దీనిచేత మను[illegible] రక్తు లగుదురు. ఈరథ్యములు -రథము రమ్ ధాతువునుండి పుట్టినది గదా. అవి క్రీడావాహకములు-ప్రసక్తమై శృంగార రససంబంధి భావపరంపరయగుచున్నది. తపముచేత లేపబడిన రజస్సులచే గూడ నవి యవిలంఘనీయము లగుచున్నవి. రజస్శబ్దము అనురాగ లక్షణము గలది. అది దుఃఖ హేతువు. రథ్యములు రసభావస్థానీయములై సచో నవి అసురక్త దుఃఖాదులను దాటిపోవుచున్నవని యర్థము. ఈ కథలో ప్రేమయున్నది. ఈ కథలో దుఃఖమున్నది. దాని నతిక్రమించి రసాంతత్వము సాగుచున్నదని యర్థము అనగా కథాభంగమైనట్లు కన్పించినను రసభంగ మెచ్చటను గాలేదని తాత్పర్యము. ఆ రథ్యములు మృగజవము నోర్వనట్లు పరుగెత్తుచున్నవి, ఇచ్చట రథ్యములు కావ్యగత రసస్థానీయములని చెప్పబడినవిగదా. మృగము శకుంతలా స్థానీయము. అనగా కావ్యగతరసము శకుంతలా పరిత్యాగాదిజనిత రసభంగ భ్రాంత్యాది సర్వ విషయాతీతమై రసము ప్రవర్తిల్లుచున్నదని యర్థము.

లేదా కాళిదాసుయొక్క ప్రయత్నము ఈ యుత్తర కథలు పూర్వకథలో చూపించు ప్రయత్న[illegible] పరమకవితాభావటిమయందు నియమిత[illegible]

పటుమార్థముల పరమ రమణీయమైన భావలక్షణములో ప్రవర్తించినదనియు వ్యంగ్యము. ఈ యర్థమునే "దర్భై రర్ధావలీఢైః శ్రమవివృత ముఖభ్రంశిభిః కీర్ణ వర్త్మా" అని కాళిదాసు సూచించినాడు, ఇట్టి యర్థము లిమిడించి వ్రాయుట శ్రమ నడుమ నడుమ నట్టిభాగములు వదలిపెట్టి యూరక యావర్ణనలు చేయుచు పోవుచుండును. అట్టి భాగములు— అనగా ఈ దృశ్యాన్వార్థగర్భిత వాక్యములు తత్తత్త కావ్యమునందు గోచరించునట్టి యర్థము నీవారా శ్శుకగర్భ కోటరముఖ భ్రష్టా స్తరూణా మధః— మరియు కుల్యాంభోభిః పవనచపలై శ్శాఖినో ధౌతమూలాః— ద్వితీయాంకములో గాహన్తాం మహిషా నిపాన సలిలం శృంగై ర్ముహు స్తాడితం — మరియు మేద శ్ఛేదకృశోదరం లఘుభవ త్యుత్థానయోగ్యము వపుః— ఇట్టి వన్నియు నీకావ్యమును లేడి పరువెత్తుచుండగా శ్రమ వివృత ముఖభ్రంశులైన అర్ధావలీఢములైన దర్భలు. అర్ధావలీఢ మన్న శబ్దములోని అర్ధశబ్దము వాని యాదిత్య ద్యోతనార్థము. అవి యింత బిగింపులోనికి రావు, కాని శిల్పములోని భాగములే.

ఇట్లు వ్యుత్పత్త్యర్థములు చెప్పి లేనిపోని యర్థములు కల్పించుచున్నా వనవచ్చును. ఆ పద్యమునుండి ఈ స్ఫూర్తి నిస్సందేహముగా వచ్చుచుండగా ఆ స్ఫూర్తి పట్టి స్ఫూర్తి గాదు. నమూలకమైనదని హేతువులు చూపించుటగాని ప్రధానమైన స్ఫూర్తిని నిర్మించుటగాదు. ఈ స్ఫూర్తి యని

వార్యము ఎందుకనగా రాజు వెంటనే ఇట్లనుచున్నాడు.
"సత్యం, అతీత్య హరితో హరింశ్చ వర్తంతే వాజినః"

యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసా తద్విపులతాం
యదర్ధే విచ్ఛిన్నం భవతి కృతసంధాన మివ తత్
ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయనయోః
నమే దూరే కించిత్ క్షణమపి నపార్శ్వే రథజవాత్.

ఏది తొలత చూచుటకు సూక్ష్మముగా కనిపించినదో అది విపులత్వమును పొందినది. అంగుళీయక ప్రదాన మున్నది. దానిమీద నెన్ని యక్షరములు గలవో అన్ని దినములు గడవకమునుపే నీకు కబురంపింతునని రాజన్నాడు. ఇది చాల సూక్ష్మ విషయము. ఇదియెంత విపులత్వమును భజించినది!

"యదర్ధే విచ్ఛిన్నం భవతి కృతసంధాన మివతత్"- ఏది సగములో విచ్ఛిన్నమైనదో అది యతుకబడినట్లున్నదా యన్నట్లున్నది. శకుంతలా దుష్యంతుల వివాహము విచ్ఛిన్నమైనట్లు గన్పించుచున్నది. అది విచ్ఛిత్తి కాలేదు. కలసియె యున్నది. దీని గలయిక రసవిషయ పర్యాలోచనలోనను దుష్యంతుని సత్పురుష లక్షణమును విచారించినపుడును తెలియును.

'ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయనయోః' ఏది ప్రకృతిచేత వక్రమో అది నయనమునకు సమరేఖగలది. దుష్యంతుడు శకుంతలను నేను మరచిపోయితి ననుటకంటె వక్రమేమున్నది? సంస్కృత భారతములోని శకుంతల కొడుకై దారేండ్లు పెరిగిన తరువాత దుష్యంతునియొద్దకు పోయినది.

ఆయనయే మరచిపోలేదు. నెలలు నిండకముందు వెళ్ళిన శకుంతల నీ దుష్యంతు డెట్లు మరచిపోయెను! ఇది ప్రకృతిలో నసహజము, ప్రకృతిచేత నింతకంటె వక్రమైనది యుండదు. అది నయనములకు సమరేఖముగా నున్నది. శిక్షాప్రపణే-నీయ తేంఅనేన ఇతి నయనం కన్నులు రెండు. ఈ దుష్యం తుని వక్రత రెండు విషయములచేత సమరేఖను దాల్చినది. ఈ రెండు విషయము లేవి! ఒకటి శాపము. రెండు దుష్యం తుని యంతఃకరణః ప్రవృత్తి.

"నమేదూరే కించిత్ క్షణమపిన పార్శ్వే రథజవాత్" మరల రథ శబ్దమును వాడినాడు. ఈ దూరపు దగ్గరలతనము సర్వకథా సంబంధియైనది. అది క్రమముగా తెలియబడెను. "సూత! పశ్యైనం వ్యాపాద్యమానమ్" సూతుడా! ఇదిగో చూడు చంపబడుచున్న దానిని." సూతపశ్యైనం వ్యాపాదితం అనలేదు. వర్తమానసామీప్యే వర్తమానవద్వా ఇతరకవులు వాడవచ్చును. కాళిదాసు తూచి వాడునుగదా. చంపబడ బోవుచున్నది. అనగా శకుంతల పరిత్యజింపబడబోవుచున్నది. పరిత్యజింపబడలేదు. నే నామెను పరిత్యజించితినని రాజన లేదు. పురోహితుడు పంచమాంకములో ఇట్లన్నాడు. "అత్ర భవతీశాపదాత్ప్రసవాన్మమగేహే తిష్ఠతు కుత ఇద ముచ్యత ఇతిచేత్, త్వంసాధుభి రాదిష్టపూర్వోఽప్రథమంచక్రవర్తినం జనయిష్యసీతి. నచేన్మునిదౌహిత్రః తల్లక్షణోపపన్నో భవి ష్యతి అభినన్ద్య శుద్ధాన్త మేనాం ప్రవేశయిష్యసి. విపర్యయే పితు రస్యా స్సమీపగమనం ఉపస్థిత మేవ." నీకు చక్రవర్తి

మైన కొడుకు పుట్టునని సాధువులు చెప్పిరిగదా. ఈమె కడు పున బుట్టినవాడు తల్లక్షణోపపన్నుడైనచో నీమెను భార్యగా స్వీకరించ వచ్చును. లేడిని తండ్రియింటికి పోవుట యుండనే యున్నది. అంతవరకు నాయింట నుంచుకొందును అన్నాడు. రాజేమనెనయును! ఆమెకు నీకు సంబంధమేమి? నీయింట నుండుటయేమి? ఆ కొడుకు చక్రవర్తి లక్షణోపపన్నుడైనంత మాత్రమున నాకొడుకని నిర్ధారణ యేమున్నది? అని మృగ స్థానీయారాలైన శకుంతలను వ్యాపాదింపవచ్చు. శకుంతలా స్థానీయమైన మృగమును వ్యాపాదింపవచ్చును. ఆ మృగము వ్యాపాదితముకాలేదు. శకుంతల పరిత్యక్త కాలేదు. రాజే మన్నాడు. "యథా గురుభ్యోరోచతే." గురువుల యిష్టము అన్నాడు. అనగా అట్టిది జరిగినచో స్వీకరించుమన్న మాటయే గదా. అందుకనే రాజు "పశ్యైనం వ్యాపాద్యమానం" అని శానచ్చువాడినాడు. క్తాంతము వాడలేదు. ఈ విచారణ లేనిచో, క్తాంతము వాడినను భాషాలక్షణవిరుద్ధముగాదు.

ఈలేడిని చంపకపోవుటలోనే కథయంతయానిక్షిప్తమై యున్నది. "ఇతి శరసంధానం నాటయతి" అని బాణసంధానము నటించుచున్నాడు. ఇది రూపకము గనుక ఇట్లు వ్రాయుట న్యాయము. కావ్యము గనుక ధ్వనిపెట్టుట న్యాయమే. అనగా శరసంధానమే చేయబడలేదు. దుష్యంతుడామెను పరిత్యజించలేనేదు. ఇది యేమిమాట యనవచ్చును దుష్యంతులిద్దరని చెప్పితినిగదా. మనోనిష్ఠుడైన దుష్యంతుడొకడు. అంతఃకరణనిష్ఠుడై పినాకీభూతుడైన దుష్యంతు

పోకడ. రస విషయమున నిద్దరు నొక్కటియే. కథాభంగ భ్రాంతి హేతువున నిద్దరు నిద్దరు.

వెంటనే ఋషులు వచ్చినారు. బాణ ముపసంహరింపు మన్నారు. రా జుపసంహరించెను. ఎక్కుపెట్టిన బాణ ముప సంహరించుట క్షత్రలక్షణముగాదు. ఇది యాశ్చర్యమైన దుష్యంతుని వినయసంపత్తిని చెప్పుచున్నది. అందుకని ఋషు లాశీర్వదించిరి.

'జన్మ యస్య పురోర్వంశే యుక్తరూప మిదం తవ
పుత్ర మేవం గుణోపేతం చక్రవర్తిన మాప్నుహి.'

ఇక్కడితో నుత్తరకథ యంతయు పూర్వకథలో చొప్పించుట యైపోయినది. ఈ కథాపరమార్థము దుష్యంతునకు భరతుడు సముత్పన్నుడగుట. అయిన శకుంతలను ప్రేమించిన దిందుకే. ఆమె గర్భముననే భరతు డుదయించ వలయును. ఇది వేరు విషయము. ప్రస్తుతము మృగవ్యాపాదనమును నిషేధించుచు ఋషులు వచ్చుట, చక్రవర్తియైన కొడుకును కనుమని దీవించుట యీ సన్నివేశము, దుర్వాసుని శాపము అది రాజునకు తెలియుట, అతని సంశయము నివారింపబడుట, మారీచాశ్రమములో పుత్రదర్శన మగుట- యీ మహార్థమున కంతకు నీ చిన్న సన్నివేశము స్ఫోరకము, వ్యంజకము. ఇదియొక విచిత్రమైన రచన.

లేడిని చంపవద్దని వచ్చినవారు మువ్వురు 'తతః ప్రవిశ త్యాత్మనా తృతీయః వైఖానసః, వైఖానసుడును మరి యిద్దరును వచ్చిరన్నమాట మాటాడినది. వైఖానసు

డొక్కడే. తక్కిన యిద్దరును మాటాడనే లేదు. వైఖానసుడు మరీచస్థానీయుడు. తక్కిన ఇద్దరు కణ్వుడును, దుర్వాసుడును కావచ్చును. కాదా శార్ఙ్గరవ శారద్వతులు కావచ్చును. ధ్వని యవివక్షితమైన విషయము. ప్రిప త్రిప్ర ప్రతిభాభాస మానము.

ఇందు వ్రాయబడిన ధ్వనులు ధ్వనులే. నా వివక్ష యొకడైనచో మరి యింకొక రసజ్ఞుని వివక్ష మఱియొకడు కానచ్చును. కాని "పశ్చార్ధేన ప్రవిష్ట శ్శరపతనభియాభూ యసా పూర్వకాయం" అన్న వాక్యము దీనికంతకు స్ఫోరక మనియు, ఉత్తర కథయంతయు సారంగ దర్శనాది బుద్ధ్యాలీ రంతము ఈ రీతిగా నిమిడింపబడి యున్నదనియు నన్న విష యము ధ్వనివేత్తలు మన్నింతు రని యాశ.

## 3

"జన్మ యస్య పురోర్వంశే యుక్తరూప మిదం తవ,
పుత్రమేవం గుణోపేతం చక్రవర్తిన మాప్నుహి"

అని వైఖానసు డాశీర్వదించగా రాజు 'పరిగృహీతం బ్రాహ్మణ వచనం' అన్నాడు. నే ననుగ్రహింపబడినా నని కాని, మరియే మాటనైన ననవచ్చును. బ్రాహ్మణవచనము పరిగ్రహింపబడినది అనుటచేత రాజు అనపత్యుడు, బహు భార్యాకుడు, కొంతవయసు దాటినవాడు. ఈ వైఖానసుని

యాశీర్వచన మట్లున్నది. ఆ రాజునకు తన యభిలాష మెదు రుగా వచ్చినట్లున్నది.

తరువాత వైఖానసుడు 'కణ్వుడు తన దుహితయైన శకుంతలను అతిథి సత్కారము కొఱకు నియోగించి యామె ననుకూలమైన దైవము నుపశమింప జేయుటకు సోమతీర్థము వెళ్ళినా' డని చెప్పెను. ఇచ్చట శకుంతలకు 'దైవము ప్రతి కూలముగా నున్నాడు' అన్నమాటలో కథ సూచింపబడు చున్నది. తత్ప్రశమనము కణ్వుడు చేసెను. అచ్చట చేయు చుండెను ఇచ్చట నామె ననుకూలించెను. ఆమె రాజునకే భార్య యయ్యెను. ఆ దైవముయొక్క ప్రాతికూల్యము మిక్కిలి పెద్దది శమింపచేయబడియు మరల దుర్వాసశ్శాప మున విజృంభించినది. ఈ మాటచేత, ఆ శాపముచేత దైవముయొక్క యపరిహార్యత్వము వ్యజ్యమాన మగు చున్నది. ఇచ్చట వ్యంగ్యము చెప్పుట యెందులకని ప్రశ్నించ వచ్చును. దైవముయొక్క ప్రాతికూల్యము కాళిదాసు సృష్టించినది. ఊరకే సృష్టించుటకాదా ఆ మహాప్రభువు ప్రతి దియు మహాకవు లర్థవంతముగనే కల్పింతురు.

అవును, రాజేమనవలయును! సరే, ఋషి లేనిచో దిరిగిపోవుద మనవలయును. ఆతిథిసత్కారమునకు నియో గింపబడిన బాలిక యుక్తవయస్క కలదియే కావలయును. ఇంతకుముందు 'పరిగృహీతం బ్రాహ్మణవచనం' అన్న మాటలో సంతానాపేక్ష కలదు. ఇప్పుడు రాజు; (ఆత్మగతం) భవతు తాం ద్రక్ష్యామి (ప్రకాశం) సైవ విదితభక్తిం మాం

మహర్షేః కరిష్యతి'. కానీ ఆమెను చూతము - ఇవి మన
సులో ననుకొన్న మాటలు. ఈ మాటలు పైకెందుకనలేదు!
ఇది యాత్మగత మెందులకు? ఇంతకుముందు కలిగిన సంతానా
పేక్ష ఆమెను చూడగలనన్న యీ మాట దగ్గఱపెట్టి చూచి
నచో రాజు మనస్సు విదితమగును. ఇప్పుడు కథనంతయు
జూచినచో పంచమాంకమున పురోహితుడు చెప్పినాడు,
తొలుత నీకు చక్రవర్తి లక్షణోపలక్షితుడైన కొడుకు గలుగు
నని సాధువులు చెప్పిరని. అట్టి పుత్రాపేక్ష రాజు మనస్సులో
నున్నది. భార్యలయందు అంతవఱకును సంతానము లేదు.
ఈ సంతాన మెప్పుడు గలుగును? ఎచ్చట గల్గునన్న ప్రత్యాశ
రాజు మనస్సులో నిత్యముగా నున్నది. బ్రాహ్మణవచనము
పరిగృహీత మన్న మాటలో మేల్కొన్నది. 'భవతు
తాంద్రక్ష్యామి' అన్న మాటలో తదభిముఖముగా ప్రవర్తించు
చున్నది. ఇది అంతరాంతమునందలి భావనాలక్షణము.
లేనిచో 'ఆత్మగతము' అన్నమాట అక్కఱలేదు.

'పైన విదితభక్తిం మాం మహర్షేః కరిష్యతి' ఆమెయే
మహర్షికి నన్ను విదితభక్తునిగా చేయగలదు. ఇచ్చట ప్రయో
గించిన కృఞ్ ధాతువులో రహస్య మున్నది. వైఖానసునకు
సామాన్యపు మాటవలె నున్నది. సంస్కృత భాషయొక్క
సొగసుచేత వాక్యమిట్లు నుండవచ్చును. కాని విచారించి
నచో, తా నామెను వరించుట, కణ్వునియొక్క పరోక్షమం
దట్లు చేయుట, ఈ విషయమంతయు, ఋషి యందు తనకు
భక్తి, లేకపోవుట గాదని చెప్పి ఋషిని ప్రసన్నుని చేయదగి

నది శకుంతల. (శేయుట కృష్) ఈ కృష్ ధాతువులోని రమ్యత యిది.

ఎవడైననింత యూహ చేయునా యని ప్రశ్న. నిస్సందేహముగా చేయును. గాంధర్విలు రిష్ట్లే చేయుదురు. పరమ భావనానిష్ఠు లిట్లే చేయుదురు. మహాకవు లిట్లే వ్రాయుదురు. రాజు మనస్సంతయు సంతానాభిలాషయు, దానికి యోగ్యురాలైన స్త్రీ కొఱకు ప్రతీక్ష చేయుటయుగానే యున్నది.

"ఇదమాశ్రమద్వారం, యావత్ప్రవిశామి" "శాంత మిదమాశ్రమపదం, స్ఫురతిచ బాహుః కుతః ఫలమిహాస్య: అథవా భవితవ్యానాం ద్వారాణి భవన్తి సర్వత్ర", ఆశ్రమ ద్వారములో నున్న ద్వార శబ్దమే శ్లోకములోగూడ ద్వారమని పెట్టినాడు. తనకు కుడిచేయి యదరినది. ఇది శాంతమైన యాశ్రమపదము. ఇక్కడ ఫలితమెట్లు? ఇది యాశ్రమ ద్వారము. ఈ ద్వారమునం దీ ఫలితము పుట్టదు. భవితవ్యమున కన్నియు ద్వారములే. అనగా నీ యాశ్రమద్వారము గూడ నా భవితవ్యమునకు ద్వారము గావచ్చును. అది యే ఫలితము? అది యాశ్రమములో జరుగరాని ఫలితమా? కుడి భుజ మదరినది. ఏదియో మంచి జరుగును. ఆ మంచి స్త్రీ లాభ మెక్కటియే యగునా? ధనము రాగూడదా? రాజ్య విస్తృతి కాగూడదా? ఏ మహాక్రతుప్రారంభమో కాకూడదా? కాని రాజు మనస్సులో చక్రవర్తియగు కొడుకు సంభవించ దగిన నూతనస్త్రీని గూర్చిందియే కోరిక గలదు. తా నది భావించుచున్నాడు. ఆ సమయమున కుడిభుజ మదరినది.

అందుచేత నీ నిమిత్తము తత్సంబంధి. మఱియు నందుచేతనే ఈ యాశ్రమ పదము శాంతమనుటయు నా ప్రవేశము నిదియు కలిసి రాజు మనస్సు పులకాంకితముగా నున్నదని, ఈ నాటకముయొక్క పరమ ప్రయోజన మదియని చెప్పక చెప్పుచున్నది. "వహతి విధిహుతం యా హవి ర్యాచ హోత్రీ" అను నాందీ శ్లోకములో నిరూపింపబడుచున్న బహు ధ్వనులలో నీ యర్థమే యిమిడియున్నది.

మరియు శాంత మన్న శబ్దముచేత నాశ్రమము నందలి జనులు శమవంతులు, రాగద్వేషాది రహితత్వము సూచింపబడుచున్నది. తన కోరిక రాగానుబంధి స్త్రీ యందలి కోరిక. దీనినే చెప్పుచున్నది. శాంత మను శబ్దము.

ఈ కథా విషయము వదలి యీ శ్లోకము నందలి రచనా శిల్పమును సుంత ప్రసంగింతును. ఇది యార్యా వృత్తము. చిన్నపద్యము. మొదటి సగములో పది మాటలు విడివిడిగా నున్నవి. రెండవ సగములో అయిదుమాటలున్నవి. మొదటి సగములో మూడు వాక్యము లున్నవి. రెండవ సగ మొక్కటియే వాక్యము. శాంతమిదా యాశ్రమపదము; స్ఫురించుచున్నది బాహువు. ఎట్లు ఫల మిక్కడ దీనికి! మొదటి రెండు వాక్యములలో శాంత, స్ఫురతి శబ్దములు మొదటివి. తన కోరిక ఫలించుటకు రాగవంతమైన జన ముండవలయును, ఆ రాగముయొక్క సర్వరాహిత్యముకల స్థల మిది. తన వాంఛకు మిక్కిలి ప్రతీపమైనచోటు అచ్చట తనకోర్కె ఫలించుట పరమాసంభవము; అదసంభవరా

ప్రాధాన్యమే తోచును బుద్ధిస్ఫురణము. అందుచేతే శాంతమన్న శబ్దమే మొదట వచ్చినది. స్ఫురించు భావము: – భావమువప కప్రాధాన్యము స్ఫురణమునకు ప్రాధాన్యము ఆ స్ఫురణము యొక్క విలక్షణత్వ మెట్టిదో! సత్పురుషుడైన దుష్యంతుని పూర్వానుభూతి సముచ్చయముల నతడు గుర్తుపట్టినది కావలయును. లేనిచో తత్స్ఫురణ విశేషమునైనది స్త్రీలాభసంబంధి యని యెట్లు నిర్ణయించగలము! 'కుతః ఫలమిహాస్య' ఎట్లు ఫలము ఇక్కడ దీనికి? గాఢశీలురు విచారణాగ్రగులైనపుడు వారికి తోచు మొదటిమాట 'అసలెట్లా' ఎట్లుఅన్న మాటయే వచ్చును. పైన అసంభవత్వము ప్రత్యక్షముగా కన్పించుచున్నప్పుడు, మొదటిమాట కుతః 'ఫల' మన్న శబ్దము సహజపతితమై అనుస్యూత మయ్యెడు మాట. తరువాత 'ఇహ' మరి తరువాత 'అస్య', ఇవి విచారణా దశలోని క్రమస్థితులు. ఎట్లు? అది సంభవించరాని స్థలమును తరువాత విచారించును. చిట్టచివరకు ఫలముయొక్క లక్షణమును వివక్షించును. ఈ క్రమము భావుకుడైనవాడు తన మనస్సును సందర్భములో తాను వాడెడి వాక్య విన్యాస లక్షణమును జాగ్రత్తగా పరిశీలించుకొన్నచో నీ యర్థము సువ్యక్తమగును, 'అస్య' అన్న శబ్దము కూడ తన స్త్రీగత వాంఛను నిరూపించుచున్నది. ఈ పద్యములోని మొదటి సగము చెప్పునపుడు దుష్యంతుడు పర్యాలోచనాపరుడై యున్నాడు. ఇచ్చటనున్న పద శబ్దములు, మూడు వాక్యముల విన్యాసము. తచ్ఛబ్దములయొక్క తత్తత్ స్థానమందలి నిక్షేపము, సర్వ

మును దుష్యంతుని పరమభావనాలక్షణమునకు వ్యంజకములుగా నున్నవి. ఆ భావనను వదలిపెట్టినాడు. పద్యములోని రెండవ సగ మొక్కటియే వాక్యము. రచనా శిల్పమున కీ పద్యము ప్రథమోదాహరణీయ మగుచున్నది.

ఈ వ్యాసమునందు తక్కిన విషయములు వదలిపెట్టి సమాపతితమైన దుష్యంతుని పుత్రవాంఛాగత బుద్ధిని విస్తరించి చూపింతును.

ప్రియంవద శకుంతలతో, బిగిసిన వల్కలపు ముడి సడలించుమని యడిగినపుడు, పయోధర విస్తారయితృకమైన తన యౌవనమునే నిందించుకొనుమని యన్నది. అప్పుడు రాజు—

ఇద ముపనత సూక్ష్మగ్రంథినా స్కంధదేశే
స్తనయుగ పరిణాహాచ్ఛాదినా వల్కలేన
వపు రతితర మస్యాః పుష్యతి స్వాం న శోభామ్
కుసుమమివ పినద్ధం పాండుపత్రోదరేణ,

ఈ శ్లోకమును ప్రక్షిప్తముగా జెప్పుదురు. ఒక శ్లోకము ప్రక్షిప్త మగుటకు కొన్ని కారణము లుండును. కొన్ని ప్రతులలో లేకపోవచ్చును. బహుభాషలుగల భారతదేశము లో, బహుభాషాదేశములయందు నెల్లడ వందలు వందలు ప్రతులుండవచ్చును. అది నిర్ణయము కాజాలదు. ఇది ప్రక్షిప్తము కాదనుటకు శ్లోకరచనచేతగాని, తద్గత శిల్పసృష్టిచేతగాని వీలున్నది. వర్ణింపబడునది యౌవనము యొక్క పయోధరవిస్తృతి.

ప్రియంవదగూడ దానికి ప్రాధాన్యమీయక తద్దేతుకమయిన యౌవనమునకు ప్రాధాన్య మిచ్చినది రాజు పయోధర వర్ణనమువకు దిగలేదు. ఆమె యౌవనమునే చూచుచున్నాడు. భుజమునందు చిన్నని ముడివేయబడినది, వక్షస్థలమును గప్పుచున్నదియునైన వల్కలముచేత పండుటాకులో నున్న పూవు వలె నామె శరీర మున్నదన్నాడు ఆమె శరీరమును రాజు పుష్పముగా జూచుచున్నాడు.

ఇదం కిలావ్యాజ మనోహరం వపుః
తపఃక్షమం సాధయితుం య ఇచ్ఛతి
ధ్రువం స నీలోత్పల పత్రధారయా
సమిల్లతాం ఛేత్తు మృషి ర్వ్యవస్యతి.

ఇచ్చటగూడ నామె శరీరమును నల్లకలువ రేకువలె చూచినాడు.

అధరః కిసలయరాగః
కోమలవిటపానుకారిణౌ బాహూ
కుసుమ మివ లోభనీయం
యౌవన మంగేషు సన్నద్ధమ్.

ఆమె పెదవి చివురాకువలె నున్నది. బాహువులు కొమ్మలవలె నున్నవి. భారతదేశములో నున్న యే కవియైనను ఆమె పయోధరములు పుష్పగుచ్ఛమువలె నున్నవనును. కాళి దాసట్లనలేదు. కుసుమమువలె లోభనీయమైన దన్నాడు. అనగా దుష్యంతున కామె పూవువలెనే కన్పించుచున్నది.

ఎన్నిచోట్ల చూచినను రాజామెను పుష్పముగనే వర్ణించు చున్నాడు. ద్వితీయాంకములో 'సురయువతి సంభవంకిలమునే రపత్యం తదుజ్ఝితాధిగతం అర్కస్యోపపతితం చ్యుత మివ వనమాలికాకుసుమమ్' జిల్లేడు చెట్టుమీద పడిన వనమాలికా పుష్పమువలె నున్నదట.

మఱియు నాయికను గూర్చిన తన యాలోచనా సంగతి విదూషకునితో జెప్పుచుతొలుదొల్తటిభావము 'అనాఘ్రాతం పుష్పము'గానే చూచినాడు. ఆ పుష్పము ఫలించి తనకు చక్రవర్తియైన కొడుకు గలుగవలయును. దుష్యంతుడు బయలుదేరినప్పటి నుండియు నతని సర్వభావనయు పుత్రకాంక్షాభరితముగ నున్నది. తదేకక్షేత్రాన్వేషణా వ్యగ్రుడై సర్వథా యతడు ప్రవర్తించెను. తాదృక్ క్షేత్రము శకుంతల. ఈ దేశ మెవని పేర జరిగినదో వాడు గలుగబోవు సంతానము.

ఇచట నొక చిన్న మీమాంస. స్త్రీ యనగా కాళిదాసుని భావమేమి? ఈ భావమునందు కామదుష్టత లేదు. ఇదియొక పవిత్రమైన భావన. ప్రస్తుతమునందు వస్తుస్వరూప దిదృక్షయే కాని యితరార్థకల్పన చేయుటలేదు. ఇతర దృష్టి లేదు. "ప్రజాతన్తుం మావ్యవచ్ఛేత్సీః" - తల్లక్షణమైన భావన. ఇది కాళిదాసు. ఆయనకంటె పరమ రమణీయమైన యథార్థమైన భావన గలవాడు సృష్టిలో నుండుట కష్టము.

ఇప్పుడా ప్రతిక్షిప్త శ్లోకమునుగూర్చి విచారింతము. ఈ రీతిగా ప్రధానభూతమైన శకుంతలావపుర్గతపుష్పసాదృశ్య

లక్షణమును చెప్పుటయేకాక యీ శ్లోకములో మఱియొక యర్థమున్నది. అది ప్రక్షిప్తముకాదనుటకే యర్థమే నాలుగును, శిల్పగత రహస్యమును స్పృశించునర్థముగల యీ శ్లోకము ప్రక్షిప్త మెట్లగును! ఇంత శిల్పరహస్యమును చూచి యెవడో ఆ శ్లోకమును వ్రాసినచో నా శ్లోక మీ గ్రంథము నందుండుటకు కవికుల గురువైన కాళిదాసునకైన నభ్యంతర ముండదనుకొందును

ఇదియే కాక యీ శ్లోకమున మఱియొక చమత్కార మున్నది. చివఱి యంకములో శకుంతల కనిపించినది. రాజామెను చూచి యిట్లన్నాడు.

"వసనే పరిధూసరే వసానా నియమక్షామముఖీ ధృతైకవేణీ
అతి నిష్కరుణస్య శుద్ధశీలా మమ దీర్ఘం విరహవ్రతం
బిభర్తి"

ఈ శ్లోకములో శకుంతల రెండు వసనములు ధరించి యున్నట్లు చెప్పబడినది. పరిధూసరములైన రెండు వసనములను ధరించినది – ప్రక్షిప్తమనబడు శ్లోకములో, శకుంతల యొక్కడే వస్త్రమును దాల్చినట్లు చెప్పబడినది. అవివాహిత లైన స్త్రీలు, వివాహితలైన స్త్రీలు, ధరించెడి దుస్తులలోని తారతమ్యము సువ్యక్తముగా కనుపించుచున్నది. తత్తక్క చాలార పర్యవేక్షణా ప్రధాన దృష్టియగు నాధునిక విమర్శ కునకు నిట్టి యాచార నిరూపకమగు శ్లోకము పరిత్యాజ్య మగునా!

ఇట్టి యర్థమును చెప్పుటకు కాళిదాసు రచనయందు ఏతాదృగ్లక్షణములు పెక్కుచోట్లకూడ భాసించినపుడు దీనికి బలము చేకూరును. అట్టి స్థలము లున్నవి. అందుచేత నిది కాళిదాసుని శిల్పమార్గ బహిర్భూతవిషయము గాదు.

ఈ రాజుయొక్క పుత్రవాంఛాసహిత యోగ్యక్షేత్రాన్వేషణము మఱియు నొక విషయముచేత తెలియుచున్నది. మధుకర నివారణమునకు తాను ప్రవేశించుచు 'కఃకోఽత్ర భోః' అనబోయి, అర్థోక్తియందు విచారించి, 'రాజభావ స్త్వభిజ్ఞాతో భవేత్, భవతు. ఏవ మభిధాస్యే' అన్నాడు. నా రాజభావము తెలిసిపోవును. కాన ఇట్లు చెప్పెదను, రాజభావ మభిజ్ఞాతమైనచో వచ్చెడి దోషమేమి? తాను రాజునని వారికి దెలిసినచో వారు కళవళపడుదు రనియా? రాజుకాక తన యంతటి తేజశ్శాలియగు పురుషుడు కనిపించినపుడు మాత్రము కళవళపడరా? రాజైనచో నెక్కువ గౌరవింతురు. అది తన కనుకూలమే కదా! రాజగుటవలన తన కతడు లభించుట సాధ్యముకాదని శకుంతల యనుకొనునా? అడవిలో నున్న బ్రాహ్మణకన్యకు గొప్ప రాజోద్యోగి మాత్రము లభించునా? ఇవి యేమియు కావు, రాజు తాను సామాన్య పురుషునివలె శకుంతలకు కనుపించవలయును. సామాన్యరాలైన యామె యావనమును తాను వాంఛించెను రాజుకాని సామాన్య పురుషుడైన తన పురుషత్వ మామెకు నచ్చవలయును. తన యందున్న రాజత్వేతరములైన గుణములచేత నామె తన్ను ప్రేమింపవలయును.

ఇది నాటకముయొక్క వస్తువు. దాని తీర్పు, దాని ప్రథమ దశయు.

౪

ఈ రీతిగా కావ్యాదియందంతయు భావి సర్వకథా సూచనయు, నదియైనంతనే దుష్యంతుని వ్రతవాంఛా సమనుగత తద్యోగ్యతాన్వేషణా నిబిరీసమతి లక్షణముగా నంయోజింపబడిన యీ ప్రథమాంకము శకుంతలా దర్శనము పరస్పర నివిష్టచిత్తత్వమును గా సమకూర్చబడినది. యథార్థమునకు కథ యంతయు నైపోయినది. తక్కిన యంకములయందు దీ కథ పరచబడుట తప్ప మిగిలిన దేమియు లేదు. కథ కాద్భుజ్జాత్రిమే మైనచో నీ కథను ప్రవంచించి తత్తత్కాల సమాపతిత వర్ణనా చమత్కారానుసంధానముగా తక్కిన యంకములను పూరించుట కాళిదాసుదాక నక్కఱలేదు. వర్ణనా నిపుణులైన కవులకు లోకమునందు కొఱత లేదు.

మఱియు వట్టి చిత్తవృత్తులచేతనేగాక వాచ్యతకు మిక్కిలి సన్నిహితముగానున్న వ్యంగ్యముచేతగూడ శకుంతల దుష్యంతున కర్పింపబడినది. ప్రియంవదమీద కోపముతో నామె యనిన మాటలు గౌతమికి చెప్పుటకు తాను పోవుచున్నానని శకుంతల బయలుదేఱినపుడు ప్రియంవద 'వృత్తసేచనే ద్వే మే ధారయసి తస్మాద్దేహి తావ దాత్మానం

మోచయిత్వా తతో గమిష్యసి', నాకు రెండు కుండలనీళ్ళు అప్పుపడి యున్నావు. అప్పుతీర్చి మరియు కదలుము అన్నది. అపుడు రాజు అంగుళీయక మిచ్చెను. ప్రియంవద 'మోచితా స్యనుకంపినార్యేణ' దయగల యీయనచేత వదలింపబడి నావు - ఒకటి. అప్పునుండి, వ్యంగ్యము కన్నచెఱనుండి, మఱియు కణ్వునినుండి.

ఈ రీతిగా సర్వము నిబద్ధమైనది. నాటకము పూర్తియైపోయినది. ఇంక నేమి మిగిలినది! అంకము పూర్తికావచ్చినది. తృతీయాంకము చివర ఏ సంఘటనము జరిగినదో - అనగా,

గాంధర్వేణ వివాహేన....
అధరస్య పిపాసతా మయా తే
సదయం సుందరి గృహ్యతే రసోఽస్య

—ఇత్యాది ఈ ప్రథమాంకాంతమందే జరుగవలయును, అపుడు రెండుమూడంకములు వ్యర్థము. అయిదా అంకములనవసరము. ఏడంకములలో నాల్గంకములు తీసివేసినచో శాకుంతలము మూడంకముల నాటకమగును. అపుడు నాటకమే లేదు. మఱి యేమి కావలయును? ఈ యంక మెట్లు పూర్తిగావలయును? తృతీయాంకము చివరనున్న సంయోగము ఈ యంకము చివర నెందుకుండగూడదు? ఉన్నచో కథయే లేదు. ఒక రాజొక తాపసికన్యకను చూచెను. వారు పెండ్లియాడిరి. ఒక కుమారుడు కలిగెను. ఇది కథ కానేరదు. ఇది యొక వార్త.

అందుచేత ఈ యంకము నిచ్చట నాపివేసి కథను

పెంచ నారంభించినాడు. ఈ యంకము నెట్లాపవలయును! అంక మారంభించుట కెంత ప్రయత్నము చేసినాడుగదా! అంకమును చివరకు వృటుక్కున త్రెంచివేయుటయా? సరిగా వట్లే కన్పించుచున్నది.

తీ వ్రాఘాతప్రతిహత తరుస్కంధలగ్నైకదన్తః
పాదాకృష్టవ్రతతివలయాసంగసంజాతపాశః
మూర్తో విఘ్న స్తపస ఇవ నో భిన్న సారంగయూథో
ధర్మారణ్యం ప్రవిశతి గజ స్స్యందనాలోకభీతః.

చెట్టుకోద పెల్లగింపబడినది, ఒక దంతముమీదగలది, కాలికి తీగలు పెనవేసికొనినది, లేళ్ళను బెదరగొట్టినది, స్యంద నాలోకభీతమైన గజము తపస్సుయొక్క విఘ్నము మూర్తి దాల్చినట్లు ధర్మారణ్యమును ప్రవేశించుచున్నది.

అనసూయా ప్రియంవదా శకుంతలలు కొంచెము గాబరాపడినారు. రాజు సైనికులు తన్ను వెదకుచు తపోవనాన శోధము చేయుచున్నా రనుకొనెను. అనసూయ అరణ్యగజ వృత్తాంతముచేత తాము పర్యాకులల మైతి మని చెప్పినది. ఇందొకదాని కొకటి సంబంధము లేదు. ఏన్గు ధర్మారణ్యమున ప్రవేశించుచున్నదనగా సైనికులు తన్ను వెదకికొంచు వచ్చుచున్నారని రాజనుకొనుటయేమి! ఆ యేన్గు రాజు సైన్యము లోనిదా! అయినచో అనసూయ అరణ్యగజవృత్తాంత మనునేమి! ఆమెకు తెలియదా! ఒకవేళ రాజు సైన్యము లోనిదైనను అట్లు చెదరిన యేనుగు ఆపద్ధేతువే యగును.

ఈ రీతిగా గజవృత్తాంతమును తెచ్చి కాళిదా సంకమును పూర్తి చేసెను. అంకమును పూర్తిచేయుటకు తీసికొని

వచ్చిన గజమైనచో నదియొక్క ఉపసమర్థుడైన శిల్పి చేయవలసిన పని. అంకము నట్లు పూర్తి చేయవలయును గనుక నేనగును మదమెక్కినదన్నాడు. బెదరిన దన్నాడు. స్త్రీలు చకితలైనా రన్నాడు. అడవి గనుక, ఏనుగు ఉండవచ్చును గనుక, అడవిలోని యేనుగులు స్వాంతనాదు లెరుగవు గనుక చూచి బెదరవచ్చును గనుక. ఈ యకారణ సామగ్రి స్థూలమైన యౌచితిని సంపాదించి పెట్టును. కాని నాటకమును పెంచుకొనిపోవలయునన్న తాత్పర్యముతో నక్కడి కంకము నాపనుద్దేశించి ఎట్లో ఒకట్లంకమును పూర్తిచేయుటకు కల్పించిన కథాదృష్టితో సప్రస్తుతమైన కల్పనగా నది. నిస్సందేహముగా భాసించును. కథావస్తువు వేఱు. దానిని పదియంకములుగా విభాగించు విద్య వేఱు కవియొక్క గొప్పతనము, కల్పనాచాతుర్యము, నేర్పు ఇట్టి విభాగము చేయుటలో వృథా కల్పనలు లేకుండ సప్రయోజనమైన కల్పనలు చేయుటలో నుండును. అంకము పూర్తిజేయుటయే తాత్పర్యమై బాహిరములై యింతకుమున్ను చూపిన యౌచిత్యాభాసములే కారణముగా నీ యేన్గు తీసికొని రాబడినచో కాళిదాసు శిల్పమున కిదియొక మచ్చయైయుండెడిది. కనుక యీ యంకమును పూర్తిచేయు విషయములో చాల సామాన్యుడైన నాటకకర్త యయ్యెడివాడు.

'మోచితా స్యనుకంపితార్యేణ' తో నాటకములోని కథ పూర్తియైనది. కాని కాలేదు. లోకములో నితర కథలు పూర్తియయ్యెడివి. ఈ కథ పూర్తి కాదు. ఈ కథయొక్క

పట్టంతయు తరువాతనే యున్నది. తృతీయాంకము చివరి వృత్తాంత మీ ప్రథమాంకాంతమున జరుగుటకు వీలులేదు. ఎందుచేత ననగా నేనుగు వచ్చినదిగనుక. అది యేనుగుకాదు గజము. ఈ యేనుగనగా నేమియో విచారించవలయును. కాళిదాసు గజశబ్దమునే తప్ప మరియొకదానిని వాడలేదు గదా! దంతి. దంతావళము, అనేకపము, ద్విపము, సింధురము, సామజ్యము, కుంభి మాతంగము, మదావళము. కుంజరము, వారణము, కరి. ఇభము, స్తంబేరమము. పద్మి ఇన్ని పేరులుండగా గజశబ్దమే యెందుకు వాడవలయును? ఏదియో యొకటి వాడవలయునుగదా! అందుచేత వాడవలయుననుటకైన వీలుండవలయును. ఇదే శబ్దమును పతియొక స్థలములో నిచ్చట నే యుద్దేశ్యముతో ప్రయోగించినాడో ఆ యుద్దేశ్యము స్పష్టముగా ప్రయోగించినచో యాదృచ్ఛికముగా ప్రయోగించిన శబ్దముగాదు అని తెలియును. మరల నీశబ్దము నెక్కడ ప్రయోగించినాడు? ఆ యుద్ధేశ్యమేమి?

సప్తమాంకము చివర భగవంతుడైన మారీచ ముని దగ్గర పెండ్లము బిడ్డలతో గూడుకొని తాను శకుంతలను మరచిపోవుట యెట్లు జరిగినదో తనకు తెలియక దాని రహస్యము మారీచ నడిగెను.

రాజా! భగవన్నిమా మాజ్ఞాకరీం వో గాంధర్వేణ వివాహే నోపయమ్య కస్యచి త్కాలస్య బంధుభి రానీతాం స్మృతిశైథిల్యా త్ప్రత్యాదిశ న్నపరాద్ధోస్మి తత్రభవతో. యుష్మత్సగోత్రస్య కణ్వస్యాశ్చా దేశా మంగుళీయకదర్శనా దూఢపూర్వామంగతోఽహం తచ్చిత్రమివ మే ప్రతిభాతి.

యథాగజో నేతి సమక్షరూపే
తస్మి న్నతి క్రామతి సంశయ స్స్యాత్
పదాని దృష్ట్వాతు భవే త్ప్రతీతి
స్తథావిధో మే మనసో వికారః.

—రాజు: భగవంతుడా! ఈ నీ సేవకురాలిని గాంధర్వమున వివాహము కొన్నాళ్ళ కాము నాము బంధువులు తీసికొనిరాగా, స్మృతి వికలము కాగా, ఈమెను నే నెఱుగనని తప్పుచేసితిని. ఆ తప్పు పూజ్యుడైన కణ్వునియందు. తరువాత ఉంగరమును చూచితిని. ఈమె నా భార్య యని తెలిసికొంటిని. ఇది నా బుద్ధికి చిత్రముగా నున్నది.

ఎదురుగా నుండగా ఇది ఏనుగు కాదని అది వెడలిపోయిన తరువాత ఏనుగేమోనని, అడుగులు చూచి ఏనుగే నని, నా మనోవికార మట్లున్నది.

మారీచః : వత్స, అలమాత్మాపచార శంకయా, సమ్మోహ స్త్వయ్యుపపన్నఏవ, శ్రూయతాం.

రాజా : అవహితతో౽స్మి.

మారీచః : యదైవాప్సర స్తీర్థావతరణా త్ప్రత్యాదేశ విక్లబాం శకుంతలా మాదాయ మేనకా దాక్షాయణీ ముపగతా. తదైవధ్యానా దవగతో౽స్మి దుర్వాసశ్శాపాదియం తపస్వినీ సహధర్మచారిణీ త్వయా ప్రత్యాదిష్టా నాన్యథేతిః సచాంగుళీయకదర్శనావసానః.

రాజా : ఏషవచనీయా న్ముక్తో౽స్మి.

మారీచుడు : దీనిని ధ్యానమునందు దెలిసికొన్నాడు.

దుర్వాసుని శాపమువలన నీ కట్లు చేసితివి. మఱి యే కారణ
మును కాదు ఆ శాపముయొక్క బలము ఉంగరముచు
చూచువరకే.

రాజు : అమ్మయ్య. నాకు నిందపోయినది.—

ఇచట మఱల గజము వచ్చినది. విస్పష్టమైన యర్థముతో
వాడబడినది. దుష్యంతుడు తనకు గలిగిన మరుపుయొక్క లక్ష
ణము గజశబ్దమును తీసికొని విస్తరించినాడు. కనుక, ప్రథ
మాంకాంతమందలి గజశబ్దము దీనికి సంబంధిగా భావించక
తప్పదు కాళిదాసుగనుక, ప్రయోజన రహితమైన కల్పన
చేయడు గనుక. గజశబ్ద వ్యుత్పత్తి యేమి? గజతి మాద్య
తీతి గజః - గజ,మదే - మదించునది. మద మనగా నేమి?
మదీహర్షగ్లేపనయోః దీనిచేత మదింతురు. తన యొక్క
తనకుఁ దెలియకుండఁ బోవును. తన్నుఁదా మఱచిపోవును.
దుర్వాసశ్శాప సంజనిత విస్మృతిరూపముగ నీ గజము తేఁబడి
నది. ఇది శిల్పము. అనుమంతలో నీ కథ పూర్తికాలేదు. నిజ
ముగ నీ కథ మొదలుపెట్టుచున్నదియే యక్కడ. ఆ దు
కనియే మోచితాస్యను కంపినార్యేణ - అన్న మాటతో
సంపూర్ణమైన వారి సంయోగ వృత్తాంతము వెంటనే గజ
వృత్తాంతము తీసికొనిరాపడినది.

ఈ గజ యెటువంటిది? 'మూర్తో విఘ్నస్తపస ఇవనః'-
మా తపస్సుయొక్క విఘ్నముయొక్క మూర్తివలె - ఇది
నేపథ్యోక్తి. నః - అనగా నెవరు? ఇది చూళిక. ఎవనిచేత
చెప్పబడినది? సూత మాగధాదుల చేత చెప్పబడును. వారు
నాట్యక ప్రయోగకుశలులు, నాటకకథావస్త్యైకాకారులు. తద

భిన్నము. అందుచేత నః అన్నమాట శకుంతలా దుష్యంత ప్రియంవదానసూయా విదూషకాదులందరి నాక్రమించుచున్నది. అందరకు విస్మృతి క్రమ్మినది. అందరియొక్క తపస్సునకు నిదియొక మహాంతరాయమైనది. ఆ యంతరాయము మూర్తికట్టినట్లు వచ్చినది యీ యేనుగు. ఆ యంతరాయమే యీ యేనుగు. ఆ యంతరాయము విస్మృతి. విస్మృతి యనగా మదము. మదమనగా గజము. ఈ గజముతో ప్రథమాంకము పూర్తియైనది. ఈ గజకల్పన అల్పబుద్ధియైన శిల్పి చేసినదిగాదు పరిణత ప్రతిభావంతుడైన కవికులగురువు చేసినది. అందుచేత వైయర్థ్యములేదు. శిల్పప్రయత్నమునందసంయమత లేదు.

ఈ గజము స్యందనాలోకభీతము. స్యందన శబ్దము యొక్క యర్థము ప్రథమ వ్యాసమునందు పొందుపఱుపబడినది. స్యందనమనగా వట్టి రథము. గాదుగదా. బయటికి భాసించు సామాన్య కథకు రథము. లోన భాసించు భావలోకములలో నిది రసస్రవణము.

ఈ యేను గెక్కడ ప్రవేశించుచున్నది? ధర్మారణ్యం ప్రవిశతి. ధర్మారణ్యమును ప్రవేశించుచున్నది. దుష్యంతుడు శకుంతలను గాంధర్వ ధర్మమున వివాహ మాడెను. వారి దాంపత్యము, వారి వివాహము సర్వము ధర్మమైనది. ఆ ధర్మము అరణ్యమువంటిది. ఎందుచేత? ఆయన పెండ్లి చేసికొనెను. ఆమె గర్భవతి యయ్యెను. తోడనే తీసికొని పోలేదు. ఈసంగతి అచ్చట నెవ్వరికిని తెలియదు. అరణ్యములో నొకచోటివారి యింకొకచోటి కందుట కష్టమైనట్లు

వారి వివాహసంబంధమైన ధర్మముకూడ కొంత యరణ్య సామ్యమును పొందియున్నది. అందులోనికి మఱపు చొచ్చినది. అందుచేత నీ గజము "ధర్మారణ్యం ప్రవిశతి" ఈ గజమింకెటువంటిది? తీవ్రమైన దెబ్బచేత భగ్నమైన చెట్టుబోద తగులుకొన్న యొక దంతము గలది. ఇచట స్కంధము, తరువు, దంతము మూడు శబ్దములు గలవు. స్కంధ మనగా నేమి? స్కందిర్ గతి శోషణయోః- పొందించునది. చెట్టునకు వేరు క్రింద కొమ్మలపైన, నడిమి భాగము స్కంధము వేరు వివాహము. దాని కెప్పుడు భంగములేదు. మొదటి మూడంకములలోని వృత్తము శాఖా పత్ర పుష్పములు సప్తమాంకము. అప్పటి వృత్తము బాగుగానే యున్నది. నడిమి స్కంధము పంచమాంకము. ఇందలి వృత్తమును ఏన్గు తీవ్రాఘాతముచేత కొట్టి తనయొక్క దంతమునందు లగ్నపఱచినది. లగ్నమైన యేకదంతము గలది. రెండు దంతములు కావు. దంతమనగా- దమ్ ఉపశమే- అన్న ధాతువునుండి పుట్టిన శబ్దము. ఈ విస్మృతి ఏమిచేసినది? వివాహ ధర్మమును సగమునందుపశమింపజేసినది. ఇది ఏకదంత శబ్ద స్వారస్యము. పూర్తిగానైనచో నాటక విచ్ఛిత్తి రసవిచ్ఛిత్తి సర్వ విచ్ఛేదమును. బలవత్తు దూయమానం ప్రత్యాయయతీవ మే హృదయం—మూఢ స్యా మహం ఏషా వా వదే న్మిథ్యా—మత్యేవ విస్మరణ. దారుణ చిత్తవృత్తే-కాస్విదవగుంఠనవతీ నాతిపరిస్ఫుట శరీర లావణ్యా—ఈసర్వమైన యర్థములును మఱచిపోయి, మఱచిపోని స్థితిని, దీనినే స్కంధలగ్నైకదంతత్వముగా చెప్పినాడు కాళిదాసు. తరుశబ్దమున్నది. తృష్ణవన

తరణయో:- అని. దేనిచేత పాతకాదులను తరింతురు? ఇచట పున్నామనరకాదులు ఆతపాదులు. దేనిచేత శకుంతలా వివాహము తరుభూతమైన వస్తువు. స్కంధమనగా ఆ వివాహ ధర్మము కొనసాగుట. దాని స్మృతి చెడిపోకుండ నుండుట. ఈ స్మృతి చెరిసగమై ఒక సగము శాపవశమున గజదంతము నందు తగుల్కొన్నది.

ఈగజ మింక నెటువంటిది? భిన్నసారంగ యూథము. సారంగయూథము భిన్నమైనది. భేదింపబడినది. చెదరిపోయి నది. సారంగమనగా: వ్యుత్పత్తి యేమి? సంవాత్య అరంగ చ్ఛతీతిసారంగ లేనిచో సారాణ్యంగాని యున్య నః, రెండవ వ్యుత్పత్తి లేడియన్న యర్థములో మొదటి వ్యుత్పత్తి చాతకమన్న యర్థములో లింగంభట్టు వ్రాసెను. అది లోక దృష్టితో వ్రాసినది. ఉభయత్ర సమన్వయ పరచ వచ్చును. లేళ్ళు గుంపులుగా దిరుగునుగదా. దానికేమి? మదము విస్మరణమన్న యీ గజమువలన నేమైనది? సారంగ యూథము భిన్నమైనది. సామాన్యార్థము చెదరిపోయినది. విశేషార్థము భిన్నలక్షణములు కలదైనదని. రాజు తాను శకుంతల నెఱుగనన్నపుడు శకుంతలా మనోలక్షణము వేఱు. శార్ఙ్గరవుని లక్షణము వేఱు. శారద్వతుని లక్షణము వేఱు. గౌతమియొక్క లక్షణము వేఱు. శారద్వతు డేమియు మాటాడడు. శార్ఙ్గరవుడు సోల్లుంఠనముగా మాటాడును. మఱి గౌతమి! అయ్యో. నాయనా, బిడ్డ యేమైపోవు నురా యని యామె గోల. ఇంక శకుంతల, భగవతి వసుధే దేహి మే వివరమ్-తల్లీ, భూదేవతా, నన్ను నీలోనికి

తీసికొనవచ్చును—ఈగజ మిట్లు భిన్నస్వరంగయూథము. ఎవరి తోవ వారిదే. అనగా ఎవరి యభిప్రాయము వారిదే.

'పాదాక్రాంతప్రతతివలయాసంగసంజాతపాశః' - పాదములచేత ఆక్రాంతమైన ప్రతతులయొక్క వలయముయొక్క ఆసంగముచేత సంజాతమైన పాశముగలది. ఈపాశము పాదమునందు. నాలుగవంతులో ఒకటవవంతు. తక్కిన మూడు వంతులు బంధింపబడలేదు. ఆ మూడు వంతులు అంతఃకరణ ప్రవృత్తి విస్మృతి మాత్రమే పాదము. కొంచెముగా దాని స్వరూపమిది. సాచవృత్తిశ్చతుర్ధా. సంశయో నిశ్చయో గర్వః స్మరణమితి. ఏవంవిధ వృత్తిభేదేన ఏకమన్తఃకరణం మన ఇతి బుద్ధిరితి అహంకార ఇతి చిత్తమితి చాఖ్యాయతే. తదుక్తమ్ మనోబుద్ధి రహంకార శ్చిత్తం కరణ మాన్తరం సంశయో నిశ్చయో గర్వః స్మరణం విషయా ఇమే ఈవృత్తి నాలుగువిధములు అందులో స్మరణము ఒకటి. దానియందు మదమేర్పడినది, అదియే గజము. ఏనుగు ప్రతతి వలయాదులు అందుచేత చతుర్థాభూతమైన యీ అంతఃకరణ వృత్తియందు నాల్గవ భాగము. అనగా ఒక పాదము. కనుకనే పాదాక్రాంత ప్రతతివలయ... మొదలైనవి వ్రాయబడినది. నాల్గవ భాగమునందు తగుల్కొన్నది తక్కిన మూడు భాగములను కూడ నంత బాధించునా యనగా అందుచేతనే ఆసంగమన్న శబ్దము వాడబడినది. ఆ- సమంతాత్ —దీని కింతశక్తి యెట్లు వచ్చినదనగా - వల్లీషు ప్రతతి ర్లతా - అది. తతి- తనూ విస్తారే—దానికి విస్తృతి కలది. ఈ రీతిగా ఇది వ్యాపిం

చినది. పడుచుటకు భంగకరముగా నున్నది. కాని ఏనుగు గనుక లెక్కసేయుటలేదు.

ఈ రీతిగా నీశ్లోకమంతయు 'గ్రీవాభంగాభిరామం' అన్న శ్లోకము 'యదాలోకే సూక్ష్మం' అన్న శ్లోకము నర్వాకథ నెట్లు వ్యాఖ్యానము సేయుచున్నవో కథకు ప్రాణభూతమైన విస్మృతియొక్క సర్వస్వరూపము నీ శ్లోకము వ్యజ్యమానముగా జేయుచున్నది.

ఈ గజవృత్తాంతమును కాళిదాసు యాదృచ్ఛికముగా తీసికొనరాలేదు. తన మహాశిల్పములో పరమమైన నాభి స్థానముగా జేసినాడు. అంక మెట్లు పూర్తిచేయుదుమా అన్న అల్పుడైన కవియొక్క దేవులాటకును దీనికిని సంబంధములేదు.

అందుకనియే రాజు ఆ యేనుగునుగూర్చి భావింపలేదు. ఆయనకీ గజరహస్యము నాటకాంతమునందు తెలియును. 'యథా గజో నేతి సమక్షరూపే' అన్న సంశయము ఆయనకు గలిగినది నాటకావసానమునందు. అందుకనియే ఆయన "సైనికా అస్మదన్వేషిణ స్తపోవన ముపరుంధన్తి. భవతు గమిష్యామి తావత్" అని నేపథ్యోక్తములైన రెండు శ్లోకములోని ప్రథమశ్లోక తాత్పర్యానుబంధిగా పలికినాడు. గజవిషయక మైన రెండవ శ్లోకార్థము అనసూయాదులకు పట్టినది. 'అనేనారణ్యగజవృత్తాంతేన పర్యాకులాస్మః' అన్నది శకుంతలా ప్రియంవదల యొక్క గూఢచిత్తవృత్తులను కలిపికొని అనసూయ. ఆమె యెందు కనవలయును? నాటకము మిత్రము

మీద దుర్వాసుని శాపమెఱిగిన దిద్దఱే. అనసూయ ప్రియం వదలు. ఈ శాపము విషయ మింకెవ్వరికిని తెలియదు. తక్కిన వారందఱును దాని ఫలితముల ననుభవించినవారే. ఇది శాపమని వారిద్దరికే తెలియును. విస్మృతి రూపమైన శాపమును. గజవృత్తాంతముచేత పర్యాకులలైరి ప్రియంవదా నసూయలు. మఱి కాళిదాసు చేతనే యీ మాట యని పించినాడు.

మఱి వెంటనే రాజేమన్నాడు? 'గచ్ఛన్తు భవత్యః' వయమప్యాశ్రమపీడా యథా న భవిష్యతి, తథా ప్రయతిష్యా మహే'-ఇచ్చట ఆశ్రమపీడా అన్న శబ్దము. జరుగునట్టి కథలో ముని యాశ్రమమని యర్థము అంతరమైన కథలో గృహ స్థాశ్రమమని యర్థము.

మఱియు, 'గచ్ఛతి పురశ్శరీరం ధావతి పశ్చాదసం స్తుతం చేతః'-శరీరము ముందునకు పోవుచున్నది. అసంస్తుత మైన చేతము వెనుకకు పరుగెత్తుచున్నది. 'శరీరం గచ్ఛతి, చేతః ధావతి' స్మరణము నాల్గవభాగము. తక్కినవి మూడు భాగములు. దీనికన్న వాసివేగ మెక్కువగదా? అసంస్తుత మనగా అపరిచితమైనది. పరిచయము లేనిది. స్మృతిరాలేదు. పంచమాంకమున రాలేదు. షష్ఠాంకమున నంగుళీయక దర్శ నము వలన ఆ రాజు మనస్సెంత గుబ్బిసలాడినది! స్మరణ రాదు. అంతఃకరణప్రవృత్తి జాగ్రద్భూతమైయున్న మహా సత్పురుషుడు, ఆతనియొక్క చేతస్సు 'పశ్చాద్ధావత్యేవ

కాళిదాసు భారత కథను మార్చినాడు. మార్పులు నాలుగైదుగా చూపించవచ్చును. భారతములోని శకుంతల రాజుకడకు పెరిగిన కొడుకుతో వెళ్ళినది. కాళిదాసు శకుంతల గర్భగుర్విణి దీనివలన రాజొకవేళ నిద్రాతేండ్లలో శకుంతలా వృత్తాంతమును భారతకథావిషయములో మఱచిపోయి యుండినను మఱచిపోయి యుండవచ్చును. ఇచట మఱచి పోవుటకు తగినంత వేళయేలేదు. ఈ మార్పుగూడ కథలోని ప్రధానాంశమైన మఱపునకు దోహదమిచ్చుచున్నదే కాని మఱియొండు కాదు. తక్కిన మార్పులు మార్పులే కాదు.

నాటకముయొక్క యాయువుపట్టు మూలకథలోని దుష్యంతుడు శకుంతలను తా నెఱుగనన్న విషయమును తీసికొని నాటకమందు దానికి ప్రాముఖ్యమిచ్చుటకు నేర్పడు చున్నది.

కథ యనగా నేమి? అతడామెను ప్రేమించెను. ఆమెను పెండ్లాడెను. ఇందు కథ యేమున్నది? వాడా పని చేయదల చెను, చేసెను. ఇందు కథ యేమున్నది? ఇవి వట్టి వార్తలు. వాడామెను ప్రేమించెను, ఆమెయు తిరిగి ప్రేమించెను. వారి వివాహమగుటకు ఆమె తండ్రి యంగీకరించలేదు. అటనుండి కష్టములారంభించెను. ఇచ్చట కథ యారంభించుచున్నది. లేదా మఱియొకడామెను ప్రేమించుచుండెను. వాడు ప్రచం డుడు. వీరి వివాహమును జరుగనీయడు. అప్పుడు కథ యున్నది. వాడా కార్యమును చేయదలచెను. అది క్లిష్టమైన కార్యము. ఆ మార్గమున చాల యడ్డంకులుగలవు. ఆ యడ్డం

కులు తొలగించుటలో మిక్కిలి కష్టమున్నది. ఇతరులతో సంఘర్షణలు కలుగును. అప్పుడది కథయగుచున్నది. ఇవి లేనిచో వార్త. ఉన్నచో కథ అది వార్త యేమి? ఇది కథ యేమి? ఒక వార్త విందుము. వినుటతో సరిపోయెను. విన్నప్పుడు ఓహో, ఇట్లు జరిగినదా అన్నంత మాత్రము మనస్సునకు అభిజ్ఞ కలుగును. ఆ వార్తయొక్క వినినవానికి గల యిష్టానిష్టములో, లాభనష్టములో మొదలైనవానినిబట్టి యావార్తస్వీకరించుటలో [illegible] లక్షణములోని తారతమ్యము లుండును. ఇది సంపూర్ణముగా లౌకికమైనవ్యవహారము. కథ లౌకికమైనదిగాదు. లౌకికమైనదానియందు కథలేదు. ఏమిజరిగినదో తెలిసికొనవలయును. ప్రతిక్రియ చేయవలయును. ప్రతిక్రియా నిర్వాహణము కొఱకు ఎంత తొందరగా తెలిసికొన్నచో నంత మంచిది అందుచే కథాప్రాణము వార్తలో లేదు. కథా ప్రాణమనగా నేమి? కథ యనగా వర్ణితమైన వస్తువు. 'కథయతి వర్ణయతి'. వర్ణింపవలసినది యుండగా కథ పుట్టుచున్నది. వర్ణమైన వస్తువు కథకుడు, శ్రోత్య ఈ యిద్దరి దృష్ట్యా రెండు విధములుగా నుండును. శ్రోత్రపేక్షయా కథ పుట్టుచున్నది. కవ్యపేక్షయా కథనములో శిల్ప మేర్పడుచున్నది. శ్రోత్రపేక్షయా కథ పుట్టుట యనగా నేమి? మానవుడు తన లోకవృత్తాంతమునందు జీవనముకొఱకు పలు విషయములు తెలిసికొనును. ఆ తెలిసికొన్నవాని ననుసరించి తన జీవికకొఱకు చేయు వృత్తము సంపూర్ణముగా శరీరసంబంధము జీవయాత్రా సంబంధము. వాని

మానస్సు తత్కాలమున సంపూర్ణముగా జీవయాత్రా లక్షణము కలదిగా నుండును. అతని మనస్సులో నింకొక లక్షణమున్నది. జీవయాత్రాసంబంధి కాక యూరకే యుబుసుపోకకు తనకు పట్టని విషయములను వినుట. ఈ యుబుసుపోక యన్న లక్షణము మానవుని ప్రవృత్తిబట్టి మిక్కిలి భేదించుచుండును. అల్పసంస్కార బుద్ధియం దది వట్టి యుబుసుపోక, సంస్క్రియా లక్షణ మధికాధికమైనకొలది అదియొక రమణము. శ్రోత్రపేక్షయా కథ పుట్టుచున్న దనగా రమణశీలమైన మానవుని ఈ బుద్ధి తత్కథాశ్రయమై యుండుచున్నది. ఈ రమణముయొక్క ప్రవృద్ధ స్వరూపము రసము. అది కథనుండి పుట్టుచున్నది. దాని స్వరూపము ద్విధాభూతమైనది. మొదటిది కథాంశగత విస్మృతి సాపేక్షమైనది. రెండవది పూర్వ కథిత కథాశరీరగత భిన్నవిషయానుబంధి

కథాశరీరము రెండవ లక్షణమును పురస్కరించుకొని యుండును. ఈ కథాశరీరగత వైలక్షణ్యాతిశయముచేత కథాంశగతవర్ణనారమణీయతాహ్లాదమస్పర్శియగును. అందుచేత కథాగత చమత్కారము కథకు ప్రాణము. శకుంతలా కథయం దొక్కటే చమత్కారమున్నది. దుష్యంతుడు నిన్నెఱుగనని శకుంతలతో ననుట, భారతమునందలి దుష్యంతుడు ప్రకృతి జనులయందలి భీతిచేత నట్లనెను. కాళిదాసు దుష్యంతుడు నిజముగా మఱచిపోయెను. నాటక కథా నాయకుడు నిజముగా మఱచిపోవలయును. లేనిచో నతని శీలమునకు లోపమేదో యేర్పడి సంపూర్ణమైన రససిద్ధియందొక కళంకమేర్పడును. ఏ రమణశీలత శ్రోతయందు పరమచిత్త

సంస్కార పరిణత మనోలక్షణమునందు సంపూర్ణమైన రసా
కృతి పొందవలయునో ఆ రసాకృతి కావ్యనాయకునియొక్క
పరమోదాత్తతా సాపేక్షకమైనది. ఇది కొంచెము ప్రపచించ
వలసియున్నది. రమణ మనుదాత్త విషయమునందు జరుగును.
ఉదాత్త విషయమునందు జరిగెడిదే రమణము. అనగా
తొలుత ద్విధావిభక్తమైన మనస్సు చూపించబడినది! ఒకటి
లౌకిక సాపేక్షము, రెండవది లౌకిక నిరపేక్షము. ఈ ద్విధా
భూతలక్షణము మానవునియందున్నది. ఉన్నది కనుకనే జీవు
డని చెప్పబడుచున్నాడు. దీనిని ప్రపంచించిన కొలది వేదాం
తములోనికి పోవును. వేదాంతము లేకుండ మానవ జీవితము
లేదు. మానవజీవితములోని నిశితత్వము లేదు. సౌకుమార్యము
లేదు. దయాదాక్షిణ్యములని అహింసయని ప్రపంచశాంతి
యని చెప్పుట యెల్ల జీవుని యునికి నంగీకరించుట, తదంగీ
కారముతో మనోరమణ మంగీకృతమైనది. తదంగీకృతిలో
నిస్సంశయముగా దాని యందలి యుత్తమ మధ్యమాధమత్వ
ములు సమాపతితము లగుచున్నవి. అందుచే రస ప్రాప్తికి
పరమ స్వచ్ఛమైన వస్తుసంయోజనము తదకలంక భావనము
వలయుచున్నవి. లోకమునందుగూడ ఒక జాతీయనాయకుడో
ఒక మహావీరుడో, ఒక మహాకవియో కావలసివచ్చు
చున్నాడు. జన్మదినోత్సవములు సేయుటగూడ. అందుచే
ఉత్తమ నాయకుడు, తదాశ్రయమైన కథయే రసమును సంపా
దించగలదు.

కనుక దుష్యంతుడు మృషావాదికారాదు. అయినచో
తద్గతభావన రసస్ఖలితము కాకపోవచ్చును, దుష్యంతుని

యందు వాని శీలమునందు లోపమే యుండరాదు. ఇట్లు పాశ్చాత్య నాటకకథావస్తువులకు ప్రాచ్యనాటక కథావస్తువులకు సముద్రమునంత భేదము సమాపత్తమగుచున్నది. పాశ్చాత్యుల మహానాటకములు కథానాయకగత నిగూఢమైనది యొక పాపభావనయో, వాని శీలములోని యొక ప్రముఖమైన కళంకమో, ఆధారముచేసికొని ఏర్పడుచున్నవి. వారికి కథాపరమార్థము తత్పాపకళంకాదులలో ఇతర సన్నివేశ సన్నికర్ష జనిత కథావసానము పరమార్థముగా గలవి. ప్రాచ్య నాటకములు నిష్కళంకుడైన కథానాయకుని జీవితములో అనూహితమై, దైవప్రేరితమై కర్మసమాపత్తమైన యొక పరిస్థితియందు వాని ధర్మానుబంధియైన ప్రవర్తన నిరూపించుట పరమార్థముగా గలవి. ఇచట నొక ప్రశ్న పుట్టవచ్చును. ఆ పాశ్చాత్య నాటక కథానాయకులయందు పాఠకునకు సానుభూతి కలుగును. ఈ ప్రాచ్య నాటకకథా నాయకునియందు సానుభూతి గలుగదని. సానుభూతి యనగా నేమి? అయ్యో పాపము, వాడును మనవంటివాడే అనుకొనుటయేనా? దీనిని కొంచెము పొడిగించినచో ఆ యొక్క దోషము వానియందు లేనిచో నెంతబాగుండెడిది? ఇట్లు జరిగెడిది కాదే అనిపించుటయు మానవసహజమేగద. ఆ యనిపించుటదేమి! ఇహలోకమందు దోషపరిపూర్ణమై దుఃఖభాజనమై కనిపించుచున్న పరిస్థితులకు మించి వీనినుండి వివర్జితమైన యొక నిర్దుష్ట స్థితియందలి యనురాగమే కదా అట్లనిపించుచున్నది. ఆ యనురాగ మెందుకున్నది? అది జీవలక్షణము. అట్టి స్థితిని

జీవుడు వాంఛించుచుండును. అందుకనియే ప్రాచ్య నాటక కథానాయకుడు సర్వసద్గుణసంపన్నుడు. వాడైనను మానవ శక్త్యతీతమైన యోగి దైవికమైన కర్మవాగురయందు తగుల్కొనుట గాదు. ఈ యతని జీవితము ఆ కర్మవాగుర. దాని అనధిగతత్వము—ఇది యంతయు ప్రాచ్యదేశ నాటకముల నాటకత్వము. భారతీయ మహానాటక కర్తలయొక్క నాటకమన్న భావము దీనియందున్నది. ప్రధానముగ ప్రాచ్య పాశ్చాత్య నాటకముల భేద మిది. భారతీయ నాటకముల నిక్షేపింపబడునది రసము. ఎప్పుడు రసము నాటక ప్రధాన లక్షణ మగుచున్నదో మనుజుల శీలములలోని భేదములకు, ఇహలోక చిత్తవృత్తములకు ప్రాధాన్యము పోవుచున్నది. వాని కంగిత్వము లేదు. అంగత్వమున కెప్పు డభ్యంతరము లేదు. రాజభటులు నీ వీ యుంగరమును దొంగిలించి తెచ్చితివా యేమని పల్లెవానిని బాధించిరి. వాని దగ్గర నేదో గుంజకొని నాటకము ప్రయాణించినట్లు కన్పించుచున్నది. ఈకథ అప్పుడు ఇప్పుడు ఎప్పుడు నొక్కటే. అంగములయం దిట్టి లక్ష చమత్కారము లుండవచ్చును. అంగి నిర్దుష్టముగా నున్నచో పాఠకుని రమణశీలతపరాకాష్ఠ పొంది రసముగా మూర్తికట్టును. అది పరమాహ్లాదాత్తచిత్తసంస్కార లక్షణసంపన్నుడైన భావుకుని నిత్యస్థితి. జీవుడు తన జీవత్వసిద్ధిని కనుట. దాని పేరు రసము. 'రసో వై సః రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి,'— ఇది కట్టిపెట్టి దుష్యంతుడు మృషావాది కాగూడదు. ఛలవాదియు కాకూడదు. దుష్యంతుడు ఛలవాదియే యని కొందరనవచ్చును.

"క్వాయం క్వపరోక్ష మన్మథో
మృగశాబైః సమమేధితో జనః
పరిహాస విజల్పితం సఖే
పరమార్థేన న గృహ్యతాం వచః"

ఇది దుష్యంతుడు మృషావాదనము చేయునప్పుడు చెప్పెదురు. ఇది మృషావాదన మైనచో ద్వితీయాంకము దాక రానక్కరలేదు. ప్రథమాంకములోననే యున్నది.

"రాజా (స్వగతం) అవసరోఽయ మాత్మానం దర్శయితుం. కః కోఽత్రభోః (ఇత్యర్థోక్తే విచార్య) రాజభావ స్త్వభిజ్ఞాతో భవేత్. - భవతు ఏవ మభిధాస్యే" అనియును, ఉంగరమిచ్చి, వారనుమాన పడుచుండగా "అలమన్యథా మాం సంభావ్య. రాజ్ఞః పరిగ్రహోఽయం" అనియును అన్నాడు. "అనేన రాజరాజకీయ యోస్సామాన్యేన వచనేన ప్రచ్ఛాదనం కృతం" అని వ్యాఖ్య. ఈ ప్రచ్ఛాదనము మృషావాదనమా! కాకపోవచ్చును. ఇచ్చట ప్రచ్ఛాదనమే. "క్వాయం...."దగ్గర ప్రచ్ఛాదనమునకు వీలు లేదందురా! "రాజ్ఞః ప్రతిగ్రహోఽయం" అన్నప్పుడు తనకడి రాజునుండి సంక్రమించినదియేగదా. రాజశ్శబ్దము నుపతి పంకమించిన దుష్యంతుడను నొక వ్యక్తికి ఇద్దఱు వ్యక్తులు రాజు, దుష్యంతుడు ఇప్పుడొ దవను. "అలం మా మన్యథా సంభావ్య"— నన్నింకొకరుగా భావింపకుడు నేను రాజునే. యింకొకరు కాను అను నర్థమేల కారాదు? నేను రాజునుకా. - అన్న అర్థమెట్లు సమాప్తమగుచున్నదో నేను రాజనే అన్న

యర్థమట్లే సహాతీ ప్రసంగుచున్నది. ఇదియే ప్రచ్ఛాదనము. నిజమేమో చెప్పటయున్నది. అన్యార్థ మితరులు స్వీకరింతురు. చెప్పినమాట స్వీకరించుటకు వీలుగా నుండును. మహాతపస్వులుగూడ లోక దృష్ట్యా ఇట్లే మాటాడుదురు. కనుక ప్రచ్ఛాదనము వ్యాపయ రెండు రెండుగా తెలిసవి. అయినచో "క్వవయం క్వపరోక్ష మన్మథః" అన్న శ్లోకములో గూడ నిట్టి ప్రచ్ఛాదన మున్నదా యన్న ప్రశ్న పుట్టును. ఉన్నది. ఎందుకనగా దుష్యంతుడు శకుంతలను గూర్చి తన యభిలాషయంతయు విదూషకునితో పలువిధముల వర్ణించి చెప్పి యీ మాటతో కాదన్నచో పోవునా! మరియు రాజ మనకొని యిట్లు చెప్పును? రాజిట్లనుకొనెను. 'చపలోఽయం వటుః కదాచి దస్మత్ప్రార్థనా మంతః పురేభ్యః కథయేత్ ప్రభవత్వేనమేవం వక్ష్యే'-ఇతనికి మనస్సు నిలువదు. నా యీ కోరిక అంతఃపురములో చెప్పునేమో! ఇతనితో నిట్లు చెప్పెదను. అని యనుకొని, మన మొక్కడోయి, తేళ్ళతో సమముగా పెరిగి శృంగారపు వాసనలేని ఆ పిల్ల యెక్కడ! అన్నాడు. అనగా ఆమెయందు మన ప్రార్థన ఫలవంతముగాదు. అది యేగదా యర్థము అంతమాత్రముచేత తన ప్రార్థన లేకుండపోయినదా? ఫలవంతముగాని ప్రార్థన యుండిన యేమి? లేక యేమి? అని విదూషకుడనుకొనవలయున. యేగద. అట్లనుకొను వాడనియేగదా? అనగా విదూషకుడు యదార్థవిషయమునందు పట్టించుకొనువాడుగాని తక్కినవి పట్టించుకొనివాడని యర్థము.

మరియు నీ మాట పరిహాస విజల్పితము. నిజముగా తీసికొనకు. అని యుత్తరార్థము. వచః—మాట. ఇదియంతయు నూటికే చెప్పితినన లేదు. పరిహాస విజల్పితమైన వచస్సును పరమార్థముగా తీసికొనకు. ఆ వచస్సేమిటి? "సురయువతి సంభవంకిల....చిరైనివేశ్య.... అనాఘ్రాతం పుష్పం...అభిముఖే మయి....దర్భాంకురేణ"....ఇవన్నియు కలిసి ఆ ఒక్క మాటకా? అతడు మాత్రము నమ్మునా? కనుక అతడు నమ్మదగిన దొక్కటే విషయము. రాజుయొక్క ప్రార్థన ఫలవంతముగాదు. అందుచేత నీ వార్తచెప్పి అంతఃపుర స్త్రీల నూడికించ నక్కఱలేదు.

అయినచో 'పరిహాస విజల్పితం సఖే పరమార్థేన నగృహ్యతాంవచః' అన్న దాని కన్వయ మెట్లు? పరిహాస విజల్పితమైన మాట యేదనగా శ్లోక పూర్వార్థ మందలి విషయము. మన మెక్కడ? పరోక్ష మన్మథమైన యా జన మెక్కడ? అన్న మాటలోని యర్థము పరిహాసముగా చెప్పినాను. ఆమె యందు నాకు ప్రేమ గలదు. నా ప్రార్థన ఫలవంతమే కాదని నీతో చెప్పుచున్నాను. అది పరిహాసము. ఈ రీతిగా ప్రచ్ఛాదనము పొసగుచున్నది.

కనుక ఈ రీతిగ దుష్యంతుని శీలము నిర్దుష్టమైనది. ఆయన మహానుభావుడు. ఇంకొక విషయ మేమనగా భారతీయ కావ్యములందు కథానాయకుడు కులీనుడు, శౌర్యవంతుడు, అవికత్థనుడు, దయావంతుడు ఇత్యాది సర్వగుణ సంపన్నుడై యుండవలెను. దుర్గుణవంతుడు కారాదు. దుర్గుణములు ప్రతినాయకునియం దుండవలెను, కావ్య మేమగు

చున్నది! దేవాసుర యుద్ధమువంటి దగుచున్నది. శృంగార రసమైనచో ప్రతినాయకుడే లేడు. అంతటి సద్గుణవంతుడైన నాయకుడు స్త్రీని వివాహమాడి నేను నిన్నెరుగను పొమ్మనుటలేదు. విడాకులిచ్చుటలేదు. కథ యెట్లు నడుపవలయును! కథ యేమి కావలయును? సర్వ సద్గుణ సనాథుడైన కథానాయకుడు. కథలో మార్పుచేయుటకు వీలులేదు. కథానాయకుడు మూసలో పోసినవాడు. కవి కల్పించవలసిన దేమియు కల్పించుటలేదు. పాశ్చాత్య కావ్యములయందలి కథలన్నియు సర్వసద్గుణ సంపన్నుడైన కథానాయకుని కివతల నున్నవి. భారతీయ కవులయొక్క కథలన్నియు సర్వసద్గుణ సంపన్నుడైన కథానాయకుని కవతల నున్నవి. వారి వీరి కావ్యముల వస్తువులకే సంబంధము లేనట్లున్నది.

ఇప్పుడు దుష్యంతు డట్టివాడు. తరువాత కథ యేమున్నది! కల్పనయంతయు విప్రలంభ సంయోగ శృంగార విషయిక వ్యభిచార్యాది భావ సమాశ్రయమై యుండవలెను. లేదా మాళవికాగ్నిమిత్రములో వలె నాయికా నాయక సంయోగమునకు వేఱ ప్రతికూలములైన శక్తులేర్పడి ప్రతిరోధము లేర్పరుపవలయును. అప్పుడది నిజమైన కథ యగునో కాదో! ఆ కథా విస్తృతి వీరరససంబంధి కథా విస్తృతి వంటిది. అనగా వీరరసములో నాయకుడొక మహాకార్యమును చేయబోగా ప్రతినాయక ముఖమున నడ్డంకులు కలుగుచుండును. ఇదే వీరరససంబంధి కథావిస్తృతి లక్షణము. శృంగార రసములో నాయికా నాయక సంయోగము జరుగుటకు ఇతర రాజభార్యల కారణముగ తత్సమాగమము దూరమై కథా

విస్తృతి జరుగుట సరిగా వీరరస కథావిస్తృతి వంటిది గదా. అందుచేతనే శృంగారరస కథ నాటికగా చెప్పబడినది. మాళవికాగ్నిమిత్రము, రత్నావళియు నిట్టివే. అచ్చట కథలు లేవు. సన్నివేశములు గలవు.

శాకుంతలమునందు కథ గలదు ఏ వస్తుభాగములున్నచో కథ యగును? ఎట్టి యంశములు కలిగినచో కథ యగునో, యెప్పుడు కథ గాదో ఈ విభాగముచేత పూర్వులు విస్పష్టము చేసిరి. శృంగార రసమునందు కథ కలుగుట కష్టమైన విషయము. పరిస్థితులు మారుటయుగాని, సామాన్య శృంగార రసమునందు కథ యేర్పడదు. ఇది కథయని చెప్పదగిన శృంగారరస సంబంధ కథ యుండుట కష్టము శకుంతలా వృత్తాంతమునందు శృంగారరస ముండి కథ యనిపించుకో దగిన స్థితి యున్నది. ఇది చాల సునిశితమైన విషయము. పరమ సూక్ష్మమైన విషయము. నిశితాదరముతో పరిశీలించిన గాని యవగతి కొగ్గనిది. అయినచో దీనియందలి కథాత్మ మెట్టిది? దీనియందలి కథాత్మ మెట్టిదని నిరూపించినచో తక్కినవాని యందలి కథలేమితనము కూడ తెలియును.

శృంగారరస మనగా నాయికా నాయకుల పరస్పర విశిష్టచిత్త లక్షణము గలది. ఈ పరస్పరానురాగమునుండి యెడబాటు, కోపము, కలహము, దూరదేశ గమనము, ప్రతీకూది విషయములచేత రసమునకు భంగ మెప్పుడును గలుగును. అందుచేత కథ యేమున్నది? మనోవృత్తులయందు, భావనావిశేషములయందు మార్పున్నది. కథ యెప్పుడు సంగతమగును? రసభంగభీతి కలిగినప్పుడు జరుగును. ఎందు

చేత! వర్ణ్యము రసాశ్రయమై యుండును గనుక. వీరాది రసములయందలి కథ ప్రతి నిమేష రసభంగ భీతిజనకము. ఇది యింకను పరమ సూక్ష్మమగు విచారణమీద నాధారపడి యున్న విషయము. మానవుని ప్రవృత్తియైన తోలుతచెప్పిన మనోరమణము కథాశ్రయమై యుండుననగా కథాగత రసాశ్రయమై యుండునని యర్థము. కథ రసాశ్రయమైయుండును. రసము కథాశ్రయమైయుండును. ఆ రసము వ్యభిచారి సాత్వికాది భావాశ్రయమై యుండును. ఈ వ్యభిచార్యాదులచేత ప్రవర్థమానమై స్థాయి రసమగును. అనగా స్థాయియందు రసముయొక్క బీజ మున్నదని యర్థము. ఆ రసబీజము మానవ మనోగతమైన తద్భిన్న రసములయొక్క స్థాయి సాతత్యము నిత్యమై, మానవ మనోగతమై యున్నది. అది రమణశీలమై యుండును. కథ అచ్చట పుట్టుచున్నది. కథ అచ్చట తెగులొత్తుచున్నది. దుష్యంతుని కథయందు కథాత్వ మొందుచున్నదనగా, శృంగారరసము ప్రవహించుట యారంభించినది. విస్మృతిచేత రసభంగము ప్రాప్తించినది. కథ భిన్నమైపోయినది. కథలేదు. కాని తరువాత కథజరిగినది. ఇవి రెండుకథలుగావలయును. రెండు రెండు భాగములైనచో, రెండు, రెండు కథలు కావలసి వచ్చును.

అప్పుడు కథలుకావు, సన్నివేశములు కావలెను. ఈ రెండు భాగములును కలిసి కథగా తీర్చవలయును ఎట్లు కథ యగును? కథకు ప్రాణమేమి? ఏకరసత్వము, ఆ యేకరసత్వమును ఈ విస్మృతితో జోడించి సంధానపరచుటలో కథాత్వము సిద్ధించుచున్నది. ఆ యేకరసత్వసిద్ధి సంఘాయక

ముగా విస్మృతిని కలిగించుటలో కాళిదాసుని జగన్నాథత్వ మున్నది. కథారహస్య పరిజ్ఞాన మున్నది. కథా స్వరూప వైతృత్వ మున్నది. అటు మాళవికాగ్నిమిత్రము వ్రాసి, ఇటు శాకుంతలము వ్రాయుటలో శృంగార రస సంబంధమైన కథ యెట్లుండునో; యెట్లుండదో తెలిసికొనిన భేద పరిజ్ఞాన మున్నది.

ఈ కథాగతత్వము చాల నిగూఢమయిన విషయము. సురక్షితమై, సుసంస్కృతమయిన చిత్తవృత్తియొక్క రమణ లక్షణములలో పరమౌచిత్యమును కూర్చియున్న విషయము. ఈ పరమ రహస్యము మీదనే రసభంగాదులు విపక్షింపబడినవి. విరోధిరసములు, మిత్రరసములు అన్న వివక్ష యేర్పాటైనది. రసవృత్తితో నేకీకృతి పొందిన విశుద్ధమైన యంతఃకరణము నందలి రహస్య మిది. కథ యందలి కథాత్వమచట నిర్ణీత మగుచున్నది.

కాళిదాసు ఆ పట్టు తెలిసినవాడు. దాని నెరుగుట యనగా రసబ్రహ్మ నెరుగుట. ఈ విస్మృతి యట్టిది.

౬

భారతములోని కథను కాళిదాసు మార్చుటను గూర్చి మున్నె చెప్పబడినది. ఇందు ప్రధానమయిన మార్పు దుర్వాసుని శాపము. ఈ ఒక్క శాపముతోడనె కాళిదాసుని కథ యంతయు మారిపోయినది. భారతములో వలె దుష్యంతు డెచ్చట నబద్ధమాడినవాడు గాలేదు. తన మనస్సులో తనకు తెలిసిన విషయమును ప్రకృతిజనులకలసి భయము వలన దాచికొని వృథావిడంబనము చేయలేదు. ధీరోదాత్తుడైన నాయకు

దైనాడు. శార్ఙ్గరవుడు దుష్యంతుడు ప్రకృతి జనులవలన భయపడువాడు కాడు. ఆయన రాజర్షి. అంతఃకరణప్రవృత్తి నిత్య జాగ్రదవస్థయందు దుష్యంతుడు. ఆయనకట్టి భయము లేదు. అతడు మహర్షి కల్పుడు. అందుకనియే 'సాక్షాత్పశ్యామీవ పినాకినమ్' అని సూచించెను. ఈ భావమే సర్వజనుల యందు వ్యాపించియున్నది.

భారతకథలో నైదాఱేండ్లు దాటిన సర్వదమనుని వెంటబెట్టుకొని శకుంతల భర్తృసన్నిధానము వెళ్ళినది. అన్నేండ్ల కాలములో దుష్యంతుడు కథను మఱచిపోయినను మఱచిపోయియుండవచ్చును. ఇచ్చట నట్లుకాదు. శకుంతల భర్తయొద్దకు పోవువరకు నెలలు కూడ నిండలేదు. నాలుగైదు నెలల గర్భవతి కావచ్చునేమో. ఈ యయిదు నెలలలోనే మఱచిపోవుట కెక్కువ సావకాశము లేదు.

మొదటి కారణము నాయకుని ధీరోదాత్త లక్షణము. అమృషావాదిత్వము సంపాదించుటకు కల్పింపబడిన శాపము. రెండవ విషయముచేత శాపముయొక్క గాఢ లక్షణము సమర్థింపబడినది.

ఈ శాపము హఠాత్తుగా సంభవించినదా? ఆకాశము నుండి యూడిపడినదా? ఒక మహాకవి యెప్పుడును హఠాత్తుగా దేనిని ప్రవేశపెట్టడు. అట్లు ప్రవేశపెట్టుటచేత వేఱు ప్రయోజన మున్నచో చేయవచ్చును. ప్రయోజనముకంటె ఔచిత్య ముండవలయును. ఇచ్చట నట్లుగాదు, శకుంతలకు దైవము ప్రతికూలముగ నున్నది. ఆ ప్రతికూల దైవమే ఈ శాపముగా పరిణమించెను. ఈ సంగతిని రాజుచేత "అది

సన్నిహితోఽత్ర కులపతిః" అని ప్రశ్నించబడి, వైఖానసుడు "ఇదానీమేవ దుహితరం శకుంతలాం అతిథి సత్కారాయ సందిశ్య దైవమస్యాః ప్రతికూలం శమయితుం సోమతీర్థం గతః" అని చెప్పినాడు. ఈ రీతిగా ఆ శాప కథకు ప్రథమాంకము నందే, దుష్యంతుడు శకుంతలా దర్శనము చేయకముందే బీజ నిక్షేపము చేసినాడు.

సరే, ఆమె ప్రతికూల దైవమును శమింపజేయుటకు సోమతీర్థమునకు కణ్వుడు వెళ్ళెగా. ప్రతికూల దైవము శమించునదేగాని పూర్తిగా నివర్తితమగునది కాదు. ఇది దైవము యొక్క లక్షణము దానజపాది శాంతికర్మలచేత ప్రతికూల దైవముయొక్క తీవ్రతను తగ్గించవచ్చును. దైవమును పరిహరించరాదు. కణ్వనంతటి మహర్షి దాని నుపశమింప జేయుటకు మాత్రమే సమర్థుడయినాడు.

ఆ ప్రతికూల దైవముయొక్క లక్షణ మెట్టిది?

ఈ నడుమ నొకానొకరు అభిజ్ఞాన శాకుంతలములోని శకుంతలా దుష్యంతుల వివాహమును గూర్చి యొక యాక్షేపము చేసినారట. 'దుష్యంతుడు వయస్సుమళ్ళినవాడు. శకుంతల చిన్నది, ఇది అసమయస్కుల నడుమ వివాహము. ఆధునికులకు రుచించదు అని మన యాధునికులకు పూర్వ గ్రంథములలో నున్నది. ఏది రుచించుచున్నది గనుక ఇది రుచించ వెదన్న విచారము! మన దేశములో నొక నానుడి గలదు. 'ముప్పదియేండ్ల పురుషుడు, మూడేండ్ల ఆడది' అని. ఇది పూర్వుల భావము. దీనిలోని యాథార్థ్యమిచట చెప్పుట

యనవసరము. లోకమును చక్కగా పరిశీలించినవారి కిదియే సమంజసమని తెలియగలదు. కౌంట్ టాల్‌స్టాయ్ కొన్ని చిన్ననవలలుగూడ వ్రాసినాడు. వానిలో 'ఫామిలీ హాపినెస్' అను నొక చిన్న నవలగలదు. ఆ కథలో తండ్రి చనిపోయిన యొక పదునారు పదునేడేండ్ల బాలిక తాను సంసారమునకు పెద్దదై తన తండ్రి స్నేహితుఁడొకడు తన్ను చూడరాగా నతనిని ప్రేమించి వివాహము చేసికొనెను. ఇట్టి సంయోగము నందు కుటుంబసౌఖ్యమున్నదని టాల్‌స్టాయ్ యొక్క యుద్దేశ్యముగదా! ఆయన మహాత్మునకు గురువువంటి వాడు. అట్టి పరిణత మేధావంతుల యభిప్రాయముల నర్థము చేసికొనవలయును. దీనిని వదలిపెట్టి మఱియొక రీతిగా విచారణ చేసినచో, శకుంతల వయస్సు విచారణీయముగ నున్నది. ఆమె మేనకా విశ్వామిత్రుల సంతానము. మేనకా విశ్వామిత్రుల కథ యేనాటిది? ఈ కథ రామాయణమందున్నది. దుష్యంతుడు రామచంద్రునకు గూడ పూర్వుడా! శకుంతల వయస్సెంత? యెవ్వరికిని తెలియదు ఆమె పూర్వయుగమునాటి స్త్రీ. రేవతీ బలరాముల సంబంధమువంటి సంబంధమిది. ఆధునిక చరిత్రకారుల లెక్కలను బట్టి సర్దినచో సర్దవచ్చునేమో గాని, పురాణములయందున్న కథాక్రమమును బట్టి, కాలక్రమమును బట్టి, సర్దుటకు ఇది వీలులేని విషయము. దుష్యంతుని వివాహము చేసికొనునపుడా నామెయొక్క బాల్యావస్థ బాల్యావస్థగానే యుండున్నని వరము నామె కెవరైన నను గ్రహించిరో, దుష్యంతు డామెను చూచునాటికి నామెకు సుమారు పదునారేండ్లున్ననుకొన్నచో బదునారేండ్లకు

పూర్వమే కణ్వుడు పసిబిడ్డగానున్న శకుంతలను మేనకచేత పరిత్యక్తయైన స్థలమునందు చూచెను. అనగా కొన్ని వేల యేండ్లు-వేలయేండ్లేమి, లక్షల యేండ్లు శకుంతల శిశువుగానే అచట పడియుండెనని యర్థము చెప్పికొనవలయును. ఇదంతయు ఇట్లున్నను. శకుంతలయొక్క ప్రతికూలదైవము చక్కగా కన్పించుచున్నది వెనుకటి యుగములో జన్మించి యొక ఋషికి దొరికి యెన్ని వేలయేండ్లో కన్యగానుండి వివాహము కాకయున్న విచిత్రమయిన యొకజీవి శకుంతల. ఆమె గర్భమున నొక మహాపురుషుడు పుట్టవలయును. అతని పేర ని దేశము పిలువబడవలయును. ఆమె కారణజన్మురాలు.

ఇన్ని యేండ్లనుండి తన యాశ్రమమునవున్న శకుంతల యొక్క ప్రతికూలదైవము నుపశమింప జేయుటకు కణ్వుడు సోమతీర్థమున కిపుడే యేల వెళ్ళినాడు!

ఆమెకు దైవము ప్రతికూల మిప్పటినుండి కాదు! వేల యేండ్లనుండి. కణ్వుడు మహర్షి. భగవంతుడు. అనగా ఆగతానాగతాదుల పరిజ్ఞానము గలవాడు, శకుంతల కిప్పటికి దైవ మనుకూలమయి వివాహము జరుగువేళ వచ్చినది, కాని కొంత ప్రాతికూల్యమున్నది. ఆ ప్రాతికూల్య ముపశమింపజేసినచో నామె సంసారము సుఖముగా నుండును. కణ్వుడు తొందరపడినాడేమో చెప్పలేము. మరి యైదేండ్లాగినచో నీ ప్రాతికూల్యముగూడ నుండెడిది గాదేమో. శకుంతలా జాతకముతో కలసి మరియొకని జాతకమున్నది. అతడు జన్మించ బోవు భరతుడు. అతడు తొమ్మిది నెలలలో జన్మించితీరవలయును. అతని కైదేండ్లు వచ్చువఱకును తల్లి జాతకము

బాగుగా లేదు. అప్పటికైనను బాగుపడదేమో. కణ్వుడు సోమతీర్థమునకు వెళ్ళి దాని నుపశమింపజేసెను. అందుచేత నైదేండ్లలో బాగుపడినది.

ఇప్పుడు శాపప్రసక్తి. ఆపద లనేక విధములుగా వచ్చును. అవి యిట్లు వచ్చునని యెవ్వరికిని తెలియదు. గ్రహచారము నెవ్వరును మార్చలేరు శకుంతలయొక్క జాతక మట్టిది. ఆమెకు మంచి దినములు. వివాహమయి గర్భవతి కావలసిన రోజులు. వెంటనే భర్తృవిరహము. అయిదారునెలలైనతరువాత సంబంధమేవిచ్ఛిన్నమైనదా అన్నస్థితి నాలుగైదేండ్లు అప్పటినుండి యథార్థముగామంచిదినములు.

ఇది యామె జాతకము. కొడుకైనభరతునకుసుమారు నాలుగైదేండ్లు వచ్చిన తరువాత నామెకు మంచిదినములు. కణ్వుడు సోమతీర్థమున తద్దైవముయొక్క ప్రాతికూల్యము నుపశమింపజేయుటచేత జరిగినది. లేనిచో నా ప్రాతికూల్య మెట్లు బాధించెడిదో తెలియదు. శకుంతల సన్యాసిని కావచ్చును. ఆమె మరణించవచ్చును. భూ వివరమునందు ప్రవేశించవచ్చును. మనకు తెలియదు. భరతుడు దుష్యంతునకు దొరుకుట వేఱు వార్త. శకుంతల చనిపోయిన తరువాత మారీచ మహర్షి భరతుని దుష్యంతునివద్దకు పంపించి 'వీడు నీ కొడుకు, శకుంతలను నీవు తిరస్కరించితివి' అని చెప్పి పంపించియుండవచ్చును. అప్పుడు దుష్యంతునకు జ్ఞప్తి కలుగవచ్చును. దుష్యంతుడు భరతుని నిస్సందేహముగా స్వీకరించెడివాడు. భరతుడు చక్రవర్తిలక్షణోపపన్నుడు గనుక దీనికి క్రింది వాక్యములు సాక్ష్యములు. శకుంతలా తిరస్కారము జరిగిన

తరువాత పురోహితు డిట్లన్నాడు.

"అత్ర భవతీ తావ దాప్రసవా న్మమ గృహేతిష్ఠతు. కుత ఇదముచ్యత ఇతిచేత్ త్వం సాధుభి రాదిష్ట పూర్వఃప్రథమం చక్రవర్తినం జనయిష్యసీతి, సచేన్మునిదౌహిత్రః, తల్లక్షణోపపన్నో భవేత్. తతః ప్రతినంద్య శుద్ధాంత మేనాం ప్రవేశయిష్యసి—విపర్యయే పితు రస్యాః సమీపనయన ముపస్థితమేవ."

ఈ మాటలకు రాజు "యథా గురుభ్యో రోచతే" అన్నాడు.

అందుచేత శకుంతలకే దైవము ప్రతికూలముగా నున్నది. భరతునకు గాదు. దానికే కణ్వు డుపశమింప జేసినాడు అదే కణ్వుని తపశ్శక్తికి పైగా ఆ కణ్వునకు శకుంతల మీద ఎంత ప్రేమ! ఆమె నత్తవారింటికి పంపించుచు కన్నులకు నీళ్ళు తెచ్చుకొన్నవాడు. నోట మాటరానివాడు. కడుపునకన్న తండ్రు లెట్టి తనయావిశ్లేష దుఃఖముల ననుభవింతురో అంత యనుభవించినవాడు.

ఆ దైవముయొక్క ప్రాతికూల్యము చాల పెద్దది. హఠా దాపతితమయినది. మఱియు శకుంతలా స్వభావ సముద్గతమయినది. పరమేశ్వరుడైన కాళిదాసు దైవమునకు వ్యాఖ్యానము చేసెను. భాష్యమును విరచించెను. దైవ ప్రాతికూల్యమనగా మనయంతట మనము చేసికొన్నది. శకుంతల దుష్యంత నివిష్టబుద్ధియై, వాకిటి ముంగిలికి వచ్చిన దుర్వాసుని చూడలేదు. నీ కామము ధర్మానుబంధిగా నుండవలయును. ఆమెయొక్క దుష్యంతగత చిత్తవృత్తి

శృంగార రసమునకు దోహదముగాని తత్కాల సమాపతిత ధర్మాచరణ ప్రతిబంధకమయినది. ఇది సృష్టిలోనిరహస్యము. ఇది ధర్మములోని రహస్యము, దైవముయొక్క రహస్యము. ఇవన్నియు నొకదానియం దొకటి యనుస్యూతములై యుండును. వానిని విశదబరచి చూచుటయు నాచరించుటయు ఋషులు చేయుదురు. తదితరులు కర్మాధీనులగుదురు. ఆ కర్మయే దైవము. ఇది వేదధర్మ రహస్యము. దీనిని కాళిదాసు వ్యంగ్యముగా తన కథాంశములయందు నిక్షేపించినాడు.

మఱియు నిందింకొక్క విశేషము గలదు. శకుంతల యొక్క పరధ్యానము, తత్ఫలితమయిన శాపము, వానియంతట నవి యప్పుడే సముద్భవించలేదు. శకుంతల పుట్టిననాటనుం డియు నున్నవి. ఇది యంతెయు ననాదినుండియు పూర్వా పూర్వోద్దిష్టములయినవై యుత్తరోత్తర కాల వివృతములై యుండును. అందుచేతనే, ప్రతికూలదైవము నుపశమింప జేయుట, కణ్వుడు సోమతీర్థమునకు వెళ్లుట, మొదలయినవి పూర్వోక్తము లైనవి. కాళిదాసు సర్వ వేదగత ధర్మకర్మ సమూహ రహస్య పరిష్కారసిద్ధాంతవేత్త. అందుచేత నీ కథ నిట్లు కల్పించి నాడు.

ఈ దైవ ప్రాతికూల్యముయొక్క బలవత్తర మెట్టిది? దాని నుపశమన మెంతవరకు జరిగినది? దాని లక్షణమేమి?

దాని లక్షణ మెట్టిదనగా నది మానవాళ్ళసంభవము కాదగినది. మిక్కిలి బలవత్తరమయినది. అందుచేతనే సులభ కోపుడైన దుర్వాసు డతిథిగా వచ్చెను. అది యెంత బల వత్తరమయినదనగా, ప్రియంవదయిట్లన్నది. 'మదాసనీత్యోపి

నివర్తితుం నేచ్ఛతి తదా [illegible] కూడ తిరిగి రానన్నాడు. దైవప్రాతికూల్య మంటిది శాపము శాపముగా నుండిపోవలసినదే. ఆ దైవ ప్రాతికూల్యమును ఆ యుపశమనమును కాళిదాసెంత విచిత్రమయిన వ్యంగ్యముతో నిరూపించినాడు! ఆ దైవముయొక్క ప్రాతికూల్యము యొక్క యపరిహార్యత్వ మెంత విచిత్రముగా నిరూపించినాడు! అనసూయ దుర్వాసుని ప్రసన్నుని చేసికొనుటకు పూలగిన్నె తీసికొనిపోవుచున్నది. ఆమె కాలుజారి పూలగిన్నె క్రిందబడినది. పూలన్నియు చెదరి జల్లబడినవి. మరల నామె పూవులన్నియు ప్రోగుచేసినది. పూలు నేల జల్లబడుటతో శాపానుభవము తప్పదనియు, మరల ప్రోగుచేయుటతో శాపమునకు నిష్కృతి లభించుననియు నర్థములు. ప్రియంవద దుర్వాసుని దగ్గరకుపోయి మరల తిరిగివచ్చినది. ఆమె యిట్లన్నది. 'ప్రకృతివక్రుడైనవాడు. ఎవరు బతిమాలినను ఒప్పుకొనడు. కాని కొంచెము మెత్తబడినాడు' అన్నది. అప్పుడనసూయ 'ఆయన విషయములో నిదే గొప్ప. తరువాత చెప్పుము, చెప్పుము' అని!

ఈ ప్రసంగముచేత శకుంతలయొక్క ప్రాతికూల్యదైవము కణ్వునియొక్క సోమతీర్థగతోపశమ తపఃప్రభావముచేత కొంత తగ్గిన లక్షణము తెలియుచున్నది. అంతటి ప్రాతికూల్యమేదో కొంతతగ్గినది. అంతవరకేసంతోషపెట్టుకొనవలయునన్నమాట.

దుర్వాసు డనుగ్రహించినాడు. "న మే వచనమన్యథా భవతు మర్హతి-కింత్వభిజ్ఞానాభరణ దర్శనేన శాపో నివర్తిష్యతే" అని. కాని యీ యనుగ్రహాంశ మెట్లున్నది!

“ఇతి మన్త్రియన్నే వాన్స్త్రితః” ఇచట రెండు విషయములు లున్నవి. అభిజ్ఞానాభరణ మొకటి యున్నదని దుర్వాసున కెట్లు తెలియును! అత డెట్లుకనెను? అతడును ఋషియే. ఆ ప్రతికూల దైవమే దుర్వాసోఋషి రూపమున వచ్చినది. ఈ యభిజ్ఞానాభరణ మా దైవమునకు తప్పకుండ తెలియును. ఇదియొక విచిత్రమయిన సృష్టి. ఈ ప్రపంచకము గిజిగాని గూడు. ఆ గూటి లక్షణము తెలిసికొని విరచించుట మహాకవిశక్తి.

అనుచునే యంతర్ధానము పొందినాడు. మఱల నీ యంతర్ధానము పొందుటలో నర్థమున్నది. అంతర్ధానము పొందినవాడు గనుక ప్రియంవద మఱల నేదియో యడుగుటకు వీలులేదు. మాటలనుచునే యంతర్ధాన మగుటలో నా యంగుళీయకము రాజునకు చూపించుటకు సులభముగానుండి, శక్రావతార తీర్థమున కన్పించకుండ పోయినది. హఠాత్తుగా పోయినది. తెలిసికోలేకుండ పోయినది. “మన్త్రియన్నే వాన్స్త్రితః” అన్నదానిలో నీ యర్థము.

కొందరు కేరళ ప్రశ్నను చెప్పుదురు. ముఖ ప్రశ్నలు చెప్పుదురు. పృచ్ఛచేయువాడు నిలుచున వైఖరినిబట్టి, అడిగిన లక్షణమునుబట్టి, స్వరమునుబట్టి, ముఖాది వికారములను బట్టి ప్రశ్నలకు సమాధానము చెప్పుదురు. ఆ వేళయందు గ్రహ సంపుటిని గుణించినను ఫలిత మిదియే వచ్చును. ఇవి యన్నియు నొకదాని కొకటి పెనవేసికొన్న విషయములు. ఈ సృష్టిగతమయిన, ఈ విలక్షణమయిన పరిస్థితులను కావ్యముల యందు రసదృష్టులైన మహా శిల్పులు విరచింతురు.

ఇది శకుంతలా దైవప్రాతికూల్యకథ.

౭

ఈ నాటకమునందు సర్వప్రధానమైనది. శాపమని చెప్పబడినది. ఈ శాప విషయము కొంత విచారణ చేయ వలసియున్నది. శాపమువలన రాజు మనస్సు మారినది. దాని చేత కథ యేర్పడినది. ప్రాచ్యనాటకములలో కథనాయకకుడు ధీరోదాత్తుడై యుండవలయును. అన్ని యుత్తమ గుణములకతడునికిపట్టు వాని స్వభావమునందు దోషమేలేదు. ఆ దోషమునుబట్టి కథ పెంపొందుటలేదు. అందుచేత ప్రాచ్య దేశనాటకములు రసమార్గము నవలంబించినవి. పాఠకుని యొక్క రమణము అనుభావ వ్యభిచారిభావ సాత్త్వికభావాశ్రయమై జరుగుచున్నది. కథాగమనముకంటె రససంబంధ బుద్ధి యెక్కువైనది. నాటక కర్తలు రసభావాదుల కధిక ప్రాధాన్యము నిచ్చిరి.

కాళిదాసు గొప్పతన మెక్కడనున్న దనగా నిట్టి భారతదేశ కావ్యపరమార్థభూతమైన రసము పరిత్యజించ లేదు. దోషరహితమైన ధీరోదాత్త నాయకుని పరిహరించ లేదు. కథ నిర్మించినాడు.

ఈ శాపము దుష్యంతుని స్వభావమును మార్చలేదు. కథను మార్చినది. శాపము కానిచో నది స్వభావమే యన వచ్చును. ఇచ్చట శాపమును తీసివేసి రసప్రాధాన్యమును, సూచ్యార్థసూచనాది ప్రాచ్య నాటకాంగ పరికరములను తొలగించినచో నభిజ్ఞాన శాకుంతలము నొక మహాపాశ్చాత్య నాటకముగా పరిగణించవచ్చును. శకుంతలా దుష్యంత

పునస్సమాగమమునుగూడఁ దొలగించినచో నది విషాదాంత నాటక మగును.

మఱచిపోవుట స్మరణము సంస్కారణ లక్షణమునకు సంబంధించినది. ఈ స్మరణమును గూర్చి విచారణలో బహు విప్రతిపత్తులు గలవు. స్మరణమునకు పూర్వానుభవము కారణము. ఇచట కొంత శాస్త్రీయమయిన విచారణ సూచింతును. ఈ విచారణ శాపవిచారణ చేయునపుడు కొంత పనికించ్చును

"విభు ర్బుద్ధ్యాదిగుణవాన్. బుద్ధిస్తు ద్వివిధా మతా
అనుభూతిః స్మృతి స్స్యాత్ అనుభూతి శ్చతుర్విధా."

కొందరు స్మృతికి అనుభవము కారణము కాదు, జ్ఞానము కారణమందురు. అనుభవము కారణమయినచో స్మరణము పుట్టదని. సమాన ప్రకారమయిన లక్షణముగల రెండు స్మరణములు ఉత్తరమయినది. పూర్వమును నాశనము చేయును గనుక. అందుచేత ఇంకొక సంస్కారమువలనగాని వేఱొక స్మరణము గలుగదని చెపుదురు. ఇది కాదని నూత్న తార్కికుల సిద్ధాంతము ఏలయనగా, సమూహాలంబనోత్తరమయిన ఘటపటాదులయొక్క క్రమస్మరణమువలన సకల విషయిక స్మరణము జరుగుట లేదనుటకు వీలు లేదు. క్రమస్మరణము దృశ్యమాన మగుచునే యున్నది. అయినను ఫలిత మయినది దృఢముగా నున్నది. ఇచట క్రమికస్మరణానుపపత్తి లేదు. తిరిగి తిరిగి కలుగుచున్న స్మరణముచేత దృఢమయిన సంస్కారముయొక్క ఉపపత్తి లేకనుటకు లేదు. అనగా దృఢతర సంస్కార మున్నదని యర్థము. ఈవిచారణలో శకుంతలా కథాగత దుష్యంత విస్మృతి యున్న పదార్థములో క్రమిక

స్మరణమునుగూర్చి కొంత సంబంధము గలదు. అందుకని ఈ సుంత విచారణ చేయబడినది.

ఈ స్మరణము లేకపోవుట అన్న దోషము దుష్యంతుని బుద్ధియందు ప్రవేశపెట్టి ఈనాటకకథ నిర్మింపబడినది. ఆ విస్మృతికి హేతువు శాపముగా చెప్పబడినది విస్మృతి లక్షణము దుష్యంతుని బుద్ధికి లేదు. మానవ బుద్ధిలో నదియొక లక్షణమే, దానియంతట నది సంభవిల్లును. జనులు పలు విషయములు మఱచిపోవుట గలదు. ఈ మఱచిపోవుట యన్న లక్షణము మఱచిపోవువాని బుద్ధి లక్షణముమీద, నాధారపడియుండును. తాను వివాహమాడిన స్త్రీని మఱచి పోవుట యసంభవమయిన విషయము దుష్యంతునివంటిసత్పురుషుడు—"సతాం హి సందేహపదేషువస్తుషు" ఈ 'సత్' రొక్క లక్షణము మరియొక వ్యాసమందు వివరింపబడును—మఱచిపోవుట మఱియు సంభవము ఇట్టి కథ పాశ్చాత్యదేశములయందు వెలసినచో, నీ దుష్యంతునకొక పరిస్థితియందు శరీరమున కొక వ్యాఘాతము గలిగి స్మృతి నశించి వైద్యశాలలయందు చికిత్సితుడై పునస్స్మృతి గలిగినట్లు చేయవలయును. అపుడు నాటకముయొక్క నాటకత్వము లేదు.

దుష్యంతుడు పరమవివేకిడు పరమసత్పురుషు, ఆయన మెదడునకు జోరైన దెబ్బ తగులలేదు. ఈ పరిస్థితిలో ఆయనకు శకుంతలావిస్మృతి జరుగవలయును, విస్మృతియనగా నెట్టిది? ఎట్లు జరుగవచ్చును? ఒక యనుభవము జరిగి జరుగనట్లు భాసించుట విస్మృతి. జరిగినవెంటనే మఱునిముసమానం బట్లు తోచదుగదా. కొంతకాలము జరుగవలయును. ఆ

కాలమునందు తదనుభవముయొక్క పునఃపునస్సంస్మరణ జరిగినచో సంస్కారము దృఢమగును, జరుగనిచో దానికి దార్ఢ్యము గలుగదు. అపుడు విస్మృతికలుగవచ్చును. ప్రత్యభిజ్ఞానము హఠాత్తుగా కలుగును. అనగా పూర్వానుభూతి యంతయు నొక్కసారి ఝటితిగా స్ఫురించును. ఈ ఝటితిస్ఫురణమునకవలంబనము మిక్కిలిట్టిగదై యుండవలయును. ఆయవలంబ మీనాటకమునందు రాజాంగుళీయకమయియున్నది-ఈయుంగుళీయకముయొక్క యవలంబత్వములోనిగాఢత్వము శకుంతలా దర్శనముకంటెకూడ గొప్పదియా? రాజు విషయములో గొప్పదియే. అందుకనియే శాకుంతల వ్యాఖ్యాతయైన శ్రీనివాసాచార్యులు 'అభినవ మధులోలుప స్త్వమ్' అన్న చూళికాశ్లోక వ్యాఖ్యానమునందు 'అభినవపదేన రత్నహారీతు పార్థివ ఇతి న్యాయేన ఉపర్యుపరి తతోఽధికాననుభూత దృష్టాశ్రిత పూర్వలోకోత్తరయువతిసంభోగలంపటత్వం ప్రకాశ్యతే' యని వ్రాసినాడు. కనుక శకుంతలకంటె కూడ ఉంగరమే గొప్పది.

ఈ యుంగరము రాజముద్రికయా? పట్టి హస్తాంగుళీయకమా? ఇది రాజముద్రిక కాదు. అయినచో బహు వ్యవహార సమాపన్నావసరత్వముచేత విస్మృతికి వీలులేదు. ఈ యుంగుళీయకము పోయినదని కూడ గుర్తు లేదు. కనిపించినపుడే అది పోయినదని తెలియుట. అందుచేత విస్మృతికి నవకాశము కలదు.

ఈ విస్మృతి యెప్పుడు జరిగినది? రాజు శకుంతలకంగుళీయక మిచ్చి "ఏకైక మాత్ర దివసే దివసే మదీయం నామాక్షరం గణయ గచ్ఛతి యావ దంతం, తావత్ప్రియే మదవ

రోధగృహప్రవేశం నేతా జనస్తవ సమీప ముపైష్యతి" ఇది గడువు. ఆ యుంగరముమీద దుష్యంతునిపేరు వ్రాయబడియున్నది. అవి యెన్ని యక్షరములో అన్ని దినములలో దుష్యంతుడు శకుంతలకొఱకు మనుష్యులను పంపించును. ఎన్ని యక్షరము లున్నవో మనకు తెలియదు. "దుష్యంత" అన్న మూడక్షరములే మాత్రముగావు అయినచో కుదురదు. "దుష్యంత మహారాజః" అన్న యేడక్షరములు గానచ్చును. సంఖ్యకూడ ఫలితమునకు యోగ్యముగా నున్నది. గనుక ఈ శాప మీ యేడు దినములలో జరిగినదై యుండవలయును.

శకుంతలాసంగమ వృత్తాంతము కొంత కణ్వాశ్రమమునందే వ్రాతబడినది. ఏలయనగా కణ్వాశ్రమమందు ఋషులు 'మహార్షే రసాన్నిధ్యాత్ రక్షాంసి నః ఇష్టివిఘ్న ముత్పాదయంతి తత్కతిపయరాత్రిం సారథిద్వితీయేన ఆయుధసధ్రీచా భవతా సనాథీక్రియతా మాశ్రమః అని యడిగినారు. ఆయన ఒప్పుకొన్నాడు. ఆయన కొన్నాళ్ళాశ్రమములో నున్నాడు. శకుంతలా ప్రథమ సమాగమ సర్వోత్సుకత్వము వానియొక్కడు తగ్గినది. ఆమె గర్భవతి యని తెలిసికొనికూడ వెళ్ళివాడేమో. ఆ వెళ్ళేడు చివర రోజులలో శకుంతలను వదలిపెట్టి వెళ్లుట మిక్కిలి కష్టముగా నతడు భావించినట్లుకూడ ప్రియంవదానసూయలకు భాసించలేదు ఆమె తనకు భార్య ఇంటికి పిలిపించుకొందుమన్న నిలుకడపొందిన మనోలక్షణమే అపుడు దుష్యంతునియందు దృశ్యమానమై యుండెను. అందుకనియే

చతుర్థాంకమునందలి మొదటి విష్కంభములో అనసూయ యిట్లన్నది.

"సఖి! ప్రియంవదే! గాంధర్వేణ వివాహ విధినా నిర్వృత్త కల్యాణా శకుంతలా అనురూపభర్తృగామినీ సంవృత్తా ఇతి నిర్వృతం మే హృదయమ్ తథాప్యేత చ్చింత నీయమ్ అద్య స రాజర్షి రిష్టిం పరిసమాప్య ఋషిభి ర్విసర్జితః ఆత్మనో నగరం ప్రవిశ్య అంతఃపుర సమాగతః ఇతోగతం వృత్తాన్తం స్మరతి వా నవేతి."

రాజు వెళ్ళి రెండుమూడు దినములై యుండవచ్చును కాదా నాలుగైదు దినములు. వెళ్ళినపుడు రాజునకు శకుంతల మీద తొలుదిటి యుత్కంఠా సముద్వేగము కల్పించలేదు కల్పించినచో అనసూయ యిప్పుడిట్లు భయ పడదు.

రాజింటికి పోయినాడు. ఇన్నాళ్ళు రాజధానియందు లేడు. అనేకములైన రాజకార్యము లాతనికొఱకు వేచియుండి యుండును మనస్సు వానియందు ప్రవేశించియుండియుండును. ఈ విస్మృతి ఆ సమయములో ఆయన మనస్సు నావరించి యుండవలెను ఆయన సహజముగా మఱచిపోవువాడు కాడు. శాప మాకాలమునకు అడికినది. తరువాత నాలుగైదు నెలలు గడచినవి. ఈ విస్మృతి బలపడినది.

ఈ శాపము అంగులీయకగత నామాక్షర సంఖ్యా దినములు గడువకముందే జరిగినది. ఏలయనగా ఈ శాపము ఏతద్విష్కంభము లోనిదే. అనసూయ ఈ అనుమానము

పడుటయు, వెంటనే శాపము సంభవించుటయు జరిగినది. అన్నాళ్లు రాజధానియందు లేక దుష్యంతుడు రాజధానికి తిరిగి వెళ్ళిన దినములు పేరుకొనియున్న రాచకార్యపు పనుల యొత్తిడి, అప్పుడీ శాపము దెబ్బదీసినది.

ఈ విస్మృతి యొక్క స్వరూప మెట్టిది? ఆద్యంతము దీని స్వరూప మిట్టిది.

యథా గజో నేతి సమక్షరూపే
తస్మి న్నతిక్రామతి సంశయస్స్యాత్
పదాని దృష్ట్వాతు భవేత్ప్రతీతిః
తథా విధో మే మనసో వికారః

ఇది అటువంటి విస్మృతి. శకుంతలయు అంగుళీయకమును. శకుంతలను చూచిన వెంటనే వివాహస్మరణము కలుగవలయునని, ఆ స్మరణ మంగుళీయకముతో జరిగినది. శకుంతలాదర్శనవేళ అన్న శ్లోక వ్యాఖ్యానము చూపింపబడినది ఆ వ్యాఖ్యానము హంసపదికాతాత్పర్యము. యథార్థ కారణము శాపము.

"బుద్ధిస్తు ద్వివిధా మతా అనుభూతిః స్మృతిశ్చ స్యాత్,

అనుభూతియు స్మృతియు రెండును కలిపి బుద్ధి. అందు కనియే పంచమాంకములో శకుంతల రాజును తృణచ్ఛన్న కూపోపమునిగా వర్ణించినపుడు రాజిట్లనెను. 'సందిగ్ధబుద్ధిం మాం కుర్వన్ అకైతవ ఇవాస్యాః కోపః ఉపలక్ష్యతే' అన్నాడు. ఈ బుద్ధియొక్క సందిగ్ధత్వ మెట్టిది? అనుభవ

మున్నది. స్మృతిలేదు. అనుభవముండుట యెట్లు? స్మృతి లేకుండుట యెట్లు?

ఇక్కడ బుద్ధి దెబ్బతినలేదు. అనుభూతి దెబ్బతిన లేదు. ఒక్క స్మృతి దెబ్బతిన్నది. మరల నొకసారి యంతః కరణ లక్షణము చెప్పకతప్పదు. ఆ యంతఃకరణము మనో బుద్ధ్యహంకార చిత్తలక్షణము కలది. అంతఃకరణమున్నది. అది యీ నాల్గు విధములుగా ప్రసరించుచున్నది. గరిష్ఠ మైనది చిత్తము కనిష్ఠమైనది మనస్సు ఈ ప్రసరణమునకు వృత్తియని పేరు. బుద్ధ్యహంకార చిత్తములు అంతఃకరణము నకు మిక్కిలి దగ్గరవి. మనస్సు నిత్యేంద్రియ సన్నికర్షము గలది. మనస్సులో తోంజదివాళ్ళు లౌకికము. మనస్సు లోకమునకు సంబంధించినది.

ఋషులయొక్క శాపము లెట్టివి: పురాణము లెన్ని యైనను పరిశీలించవచ్చును. నీవు రాతిపికమ్ము—వేయిజన్మలు కుక్కజన్మ లెత్తుము— నీసంతానము కిరాతు లగుదురుగాక— నీ వంధుడ వగుదువుగాక— నీకు సంతానము లేకపోవుగాక— ఎన్ని శాపములైనను జీవుని కార్యానుభవమునకు సంబంధిం చినవి. వాని బహుజన్మల శరీరములు తద్గత సుఖదుఃఖాను భవములకు సంబంధించినవి.

నీ కెప్పుడును పుణ్యాపుటూహారాకుండగాక—నీ యంతః కరణము నశించుగాక— నీలో చైతన్యము నశించుగాక – ఇట్టి శాపము లిచ్చుటను లేవు, ఉండవు. వీలులేదు.

ఏలయనగా బుద్ధ్యహంకార చిత్తములు అంతఃకరణ ప్రధాన లక్షణములు గలవి. అంతఃకరణ మనగా జీవ చైతన్యము. మాయారహితమైన బ్రహ్మ చైతన్యము. దానికి శాపము లేదు. నాశము లేదు. కనుక లౌకికమంతయు, కర్మానుభూతియంతయు, కష్టసుఖములన్నియు మనో నిష్ఠములు. మనస్సునకు కర్మలకు లంకె, అనుభవమునకు మనస్సునకు లంకె. కనుక మనస్సునకు సంబంధించిన స్మరణము లోక సంబంధమైనది. శాప మందులో గలిగినది. శాపము దానియందు ప్రవర్తించును. బుద్ధ్యహంకారచిత్తములయందు ప్రవర్తించదు.

నీవు దీనిని మఱచిపోదువుగాక అన్న శాపము మతి యింకెచ్చటను కన్పించుటలేదు. శాప మిచ్చినది దుర్వాసుడు. ఈ దుర్వాసుడు యతి. ఋషులలో యతియైనవాడీయన యొక్కడే. ఇతర ఋషుల శాపము లిట్లుండవు. ఈయన యతిగనుక యీయన శాపము మనస్సును స్పృశించినది, యతియొక్క ప్రధానకర్మ మనోనిగ్రహము గనుక.

'విచిన్తయన్తీ యమనన్యమానసా
తపోనిధిం వేత్సి న మా ముపస్థితమ్
స్మరిష్యతి త్వాం న స బోధితోఽపి సన్
కథాం ప్రమత్తః ప్రథమం కృతా మివ'

ఈ శ్లోకములో 'మాం' అన్న శబ్దమునకు 'స్వస్య ఇతర ఋషివైలక్షణ్యేన శీఘ్రకోపత్వం, అవమానాసహిష్ణుత్వం చ వ్యజ్యతే' అని పూర్వ వ్యాఖ్యానము. కానియిట్లు వ్రాయవచ్చును:

అహం తావత్ తపోరూప మనోదయా మనసాకల్పిత పరి జ్ఞాతా. మమ మనస్యధికారోఽస్తి; యథాహం సమాధికారో వర్తతే తథా మమ యమానినః, అహం మనస్వంతరం త్వాం భావయసి తస్యాపి మమాధికారోఽస్తి యదహం సర్వస్య మనసః స్వరూపానగతిమాన్."

ఇట్లు గూడ వ్యాఖ్యానము చేయవచ్చును, అనగా దుర్వాసుడు మనోనియమము సర్వలక్షణ పరిజ్ఞాతయైనందున దానిపై నధికారము గలవాడు గూడ నైయుండెను. ఎవని మనస్సైనను సర్వజీవసమాహారభూతుడు పరమేశ్వరుడైనట్లు, సర్వ మనస్సమాహారభూతద్రవ్యము మీద దుర్వాసుని విలక్షణమైన మనోనియమము లక్షణముచేత నధికారము గలదు, అని యర్థము.

ఇది కాళిదాసునియొక్క వ్యాఖ్యానము. అంతఃకరణముయొక్క నాల్గవ భాగమైన మనస్సులోని స్మృతి ఋషి శాపమున కధీనమై యుండవచ్చును. అది ఋషులయొక్క శాపపరిధిలోనిదే. ఎందుచేత? లోకమునకు సంబంధించినది గనుక-లోకము కర్మయొక్క సమాహారభూతము. సుఖ దుఃఖములు మనస్సున కధీనములు. లోకమునందలి సర్వ సుఖములయొక్క సారము స్మృతిజన్యము. అనుభవము సుఖము. స్మృతి సుఖసారము. అందుకనే సంభోగ శృంగారముకంటె విప్రలంభశృంగార ముత్తమము.

కాళిదాసు శాపము నిట్లు కల్పించెను. శాపము వెనుక నున్న తత్త్వమిది. ఈ శాపము ఒక్క మనస్సునే బాధించు చున్నది. స్మరణమును మాత్రమునే బాధించుచున్నది. తక్కువ

వేనిని బాధించలేము. ఇట్టి పూర్వదేశమునందలి శాస్త్రచేతనే ఈ నాటకమునందలి తత్త్వ కథ జరిగినది. దుష్యంతుడు సత్పురుషుడగుటచేత నాగరి స్వభావము చెడలేదు. అంతఃకరణము నందలి తత్తర భాగము లబాధితము లగుటచేత నాటకమునకు రసము భంగము కాలేదు.

కాళిదాసు ఋషికల్పుడు. అంతఃకరణ స్వరూప నిర్ణేత.

౮

కథానాయకుడు సర్వసద్గుణ సంపన్నుడై యుండవలయును, తరువాత కవి యేమి సేయవలయును? నాయకునందేదో కొన్ని దోషము లున్నగదా కథకు దారితీయుట! పూర్వము చెప్పినట్లు అనుభావ వ్యభిచార్యాది భావములను పురస్కరించుకొని రసదృష్టితో కథను నిర్మించుకొనవలయును. కాక రసమును పెంపుచేసికొనవలయును. లేదా పలుసన్నివేశములు లోకమునందు జరుగుచునే యుండునుగదా! అట్టివేవో జరిగించవలయును. రామచంద్రుని భార్యను రావణుడెత్తికొనిపోయినట్లు, సుగ్రీవాది సమాగమము జరిగినట్లు, దైవము సంఘటించిన కీళ్లు మెళ్ళు పురస్కరించుకొని కథ నడుపవలయును. నాయకుడు ఉత్తముడు, సత్కులీనుడు, అవికత్థనుడు, శౌర్యవంతుడు, చలచిత్తు నేనియు చాపద్రోత్కటాలడు. ఆ నాయకుడెప్పుడు నట్లే. సర్వప్రాచ్య మహానాటకములందు నాయకుని శీలమునందు విశేషము పుట్టుటకు వీలులేదు.

కాళిదాసుని నాయకుడైన దుష్యంతుడు కూడ నట్టి వాడేనా! అంత మాత్రముతో కాళిదా సూరకుండునా! రసము మాత్రము నిక్షేపించి యూరకయుండు కవులు సంతృప్తులు కావచ్చును. కాళిదా సంతకంటె నధికుడు, తన నాయకునిలో మఱి యొకో గొప్పతనమును నిక్షేపించి తీరును. ఆ గొప్పతనమునకు కథా ప్రాణమునకు లంకె పెట్టును. సత్కులీనతాది లక్షణములతో సంతృప్తిపడి యూరకుండడు. అందుకనియే సృష్టిలో నే గ్రంథమునందు చూడరాని యొక కథానాయక లక్షణము దుష్యంతునియందు నిక్షేపించినాడు. తొలుతనే 'సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణమంతఃకరణ ప్రవృత్తయః' అని దుష్యంతుడు తన్నుగూర్చి తాను చెప్పికొనినాడు.

తన మనస్సు క్షత్రపరిగ్రహయోగ్య కాని స్త్రీయందు ప్రసరించదు అని దుష్యంతుడు చెప్పినాడు. శకుంతల క్షత్రపరిగ్రహయోగ్యయని నిర్ణయింపబడినది. అందుకనియే రాజు 'మానుషీషు కథంవా స్యాత్ అస్య రూపస్య సంభవః' అనియు 'లబ్ధావకాశో మే మనోరథః' అనియు 'భవహృదయ సాభిలాషం సంప్రతి సందేహ నిర్ణయోజాతః, ఆశంకంసే యదగ్నిః తదిదం స్పర్శక్షమం రత్నం' అనియు చెప్పినాడు, కనుక దుష్యంతుడు తాను సత్పురుషుడనని చెప్పిన మాట పొగడికోలు కాదు. వికత్థనత్వము కాదు. మఱియు నాయకగత సచ్ఛీలత లోపించలేదు. ఆయన ధీరోదాత్తతకు భంగము కలుగలేదు.

మఱియు సద్వినయమున చెప్పినమాట పొగడికోలు

కాదు. పొగడికోలు అనునది యసద్విషయమున నుండును. నే నంత చేయుదును, ఇంత చేయుదు నన్న మాటలలో వికత్థనత్వ ముండును గాని నా యాంతర లక్షణ మిట్టి దిట్టిది అని సద్విషయమున చెప్పినప్పుడు దానిని పొగడికోలుతన మని చెప్పుటకు వీలు లేదు. ప్రస్తుతము దుష్యంతుడు తాను సత్పురుషుడని చెప్పినాడు. ఆ సత్పురుషుని లక్షణ మిట్టిదనగా సందేహాపదములైన వస్తువులందు వాని యంతఃకరణ ము తనికి ప్రమాణభూతముగా నుండును.

ఈ నాటకము యొక్క యాయువుపట్టంతయు నీ వాక్యములో నున్నది. ఈ వాక్యములోని యర్థము నాటకము యొక్క కథను, సన్నివేశమును, రసమును సాగించుచున్నది. ఇప్పుడు ఈ సత్ అన్న శబ్దముయొక్క విచారణ తోలుత జరుగవలయును.

సత్ అనగా ఉనికి కలది అని యర్థము. సత్ చిత్ ఆ మాటలోనిది. అది ఉన్నది. సత్పురుషు డనగా ఉన్నదని చెప్పదగిన దానియందు ప్రవర్తించువాడు.

ఏది ఉన్నది? బ్రహ్మపదార్థ మున్నది. సత్ప్రదకమైన ధర్మమున్నది. సత్తు, అసత్తు అన్న రెండు మాటలయొక్క అర్థము లోకమునందు సర్వదా ప్రయోగింపబడుచు నేయున్నది. అక్కడి యర్థము నిదియే. సత్పురుషు డనగా ధర్మమునందు ప్రవర్తించువాడు. ధర్మము నిత్యమైనది, దానికి భంగము లేదు. అదియే యున్నది. తదనుబంధి ప్రవర్తన కలవాడు సత్పురుషుడు. ఇక దృష్టితో సదసత్తులనగా ధర్మాధర్మము లని చెప్పవచ్చును.

సవర్ణ వివాహము ధర్మమైనది. ఇది సద్విషయము. పెఱటు సద్విషయములు కావని యర్థము.

సత్పురుషునకు బుద్ధి ధర్మమైన విషయమునందే ప్రవర్తించును. ఇదియే సత్పురుష శబ్దము ధర్మమైన దేదో వేదశాస్త్రములు నిరూపించి యుండుటకే చెప్పినవి.

పలు కావ్యములలోని కథానాయకులు సత్పురుషులే. అప్పుడు దుష్యంతుని విశేషమేమి? వారికి దుష్యంతునకు గల భేద మిది. వారు సత్పురుషులై కర్మమార్గమునందు సంచరింతురు. మేము కర్మమార్గమునందు సంచరించుచున్నామని వారు చెప్పగలరుగాని నేను చేయుచున్నదే ధర్మమని చెప్పలేరు. ఇది ధర్మము ఇది యధర్మమని నా యంతఃకరణము చెప్పుచున్నదని యనలేరు ఇదియే దుష్యంతుని విశేషము. ఈ విశేష మేమనగా ఆయనయందు అంతఃకరణము జాగ్రదవస్థాగతమై యున్నది. ఇతర సజ్జనులయందు తాదృగ్జాగ్రదవస్థాగతమై యుండదు. శాస్త్రము లిట్లు చెప్పుచున్నవి. గనుక నేనట్లు చేయుచున్నాను అనెడువాడు శాస్త్ర ప్రమాణాధిషణుడు సత్పురుషుడు. నా యంతఃకరణ మిట్లు చెప్పుచున్నది. నేను సత్పురుషుడను. అందుచేత నా యంతఃకరణ మన్యథా చెప్పదు అనెడివాడు సత్పురుషునికంటె అతీతుడు. తనలోని యంతఃకరణమును తాను తెలిసికొన్నవాడు.

అంతఃకరణము చతుర్విధమై యుండునని చెప్పబడినది. దాని వృత్తి ప్రధానమైన యంతఃకరణ స్వరూపము కాదు. ప్రధానమైన యంతఃకరణ స్వరూప మేమనగా వృత్తి

పరిమితమై ఏ చైతన్యము చేత జీవభావము కలుగుచున్నదో ఏ చైతన్యము జీవుడుగా చెప్పబడుచున్నాడో ఆ చైతన్యము యొక్క పరిమితమైన స్వరూపము. ఆ జీవుడే అంతఃకరణము. కొంత భేదమున్నది. జీవుడు వ్యక్తి బహు సంస్కార సంపుటి. అంతఃకరణము తత్సంపుటిని శరీరగతమైన జీవుని ప్రకాశింప జేయగల లక్షణముగల చైతన్యముయొక్క వెలుగు. ఈ యంతఃకరణము శరీరగత జీవభావమును ప్రకాశింపజేయునదియు, వ్యాప్తిగా ప్రసరించగలదియునైన వెలుగు. ఇది విద్యుత్కేంద్రమువంటిది. అందున్న విద్యుచ్ఛక్తి వెనుక నున్న కొన్ని యంత్రములనుండి సముద్భవింపజేయబడినది. ఈ శక్తినుండి విద్యుత్కాంతులు ప్రవహింపజేయబడును. ఆ విద్యుచ్ఛక్తి నిలువయున్న చోటెటువంటిదో ఈ యంతఃకరణ మట్టిదని చెప్పవచ్చును. జీవగతమైన చైతన్యము వ్యక్త్యపేతయై తన అచ్ఛమైన చైతన్యము నొక చోట ఉంచుకొన్నది. అది యంతఃకరణము.

ఈ యంతఃకరణము సర్వ జీవరాసులయందు గలదు, ఈ సర్వాంతఃకరణ సమాహారభూతమైన వస్తువు కలదు. దానిని పరమ శివుడుగా చెప్పుదురు. అదియే లింగము.

సూతుడు రాజును 'మృగానుసారిణం సాక్షాత్పశ్యామీవ పినాకినమ్' అన్న మాటలోని దుష్యంతుడు శివునితో పోల్చబడుటకు కారణము దుష్యంతుని యంతఃకరణమునందు మేల్కొని యుండుటయే. దుష్యంతుడు సాక్షాత్తు శివుడు. శివాంశ ప్రజ్వలితమైన జీవుడు. కాని సర్వాంతఃకరణ సమాహారభూతమైనవాడు కాడు. తత్సమాహారమునం దేకదేశ

మైనవాడు, సముద్రములోనున్న నీటిబిందువు సముద్రములోనిది. చెఱువులోని నీటిబిందువు చెఱువులోనిది. ఒక చెంబుతో చెఱువులోని నీళ్ళు తెచ్చి యివి చెఱువు నీళ్ళందుము. సముద్రపు నీళ్ళు తెచ్చి యివి సముద్రపు నీళ్ళందుము. ఆ రీతిగా దుష్యంతునిలోని యంతఃకరణము పరమశివ సమాహార భూతాంతఃకరణములోనిది 'పశ్యామివ పినాకినమ్' అన్న మాట కర్థమిది.

అనగా ఈ దుష్యంతుడు - అటు నిత్యజాగదవస్థాభూతమైన యంతఃకరణమునందు మేల్కొనియున్నాడు. ఇటు సర్వజీవులవలె సంసారమందున్నాడు వృత్తి సమృద్ధిగానున్నది. సత్పురుషునకు అసత్పురుషునకు భేద మిట్లుండును. వృత్తిచేత యసత్పురుషుని అంతఃకరణ ప్రవృత్తి పిహితమయిపోవును. అది వ్యయముకాదు. వ్యయమగు లక్షణము దానియందు లేదు. సత్పురుషునియందు తదంతఃకరణ ప్రవృత్తి పిహితము కాదు. అది వెలుఁగుగదా, వెలుగు అన్న పదార్థమునకు తదితర పదార్థములకు భేదమున్నది. తదితరమయిన యే పదార్థమయినను వృత్తియందు తన మూర్తిని వ్యయపెట్టికొనును. తానే అదిగా పరిణామము పొందును. వెలుఁగట్లు కాదు. దాని ప్రసారమువలన నది వ్యయము గాదు, తాను కొంతమేర వ్యాపించినచో రొచ్చుటనుండి అది వ్యాపించినచో అచ్చటి వస్తువునకు భంగములేదు. ఉదాహరణగా నొక దీపమును తీసికొందము. దానినుండి వెలుఁగువచ్చుచున్నది. దీపమట్లేయున్నది. తక్కినపదార్థములిట్లుగాదు. ఇంతమున్న తీసికొంతమేరచల్లినచో ఆమున్నక్కడ లేదు. ఇంతవాయు

వును గొంతుకమీఁద నిలిచినచో నచట వాయువు లేదు. ఇంత వెలుగును తీసి మరొకచోట చల్లుట కాదు. ఆ వెలుగు ప్రసరించును, ప్రసరించదు. తా నచ్చట నుండును. తోడ్తోన ప్రసరించును.

ఇది యంతఃకరణముయొక్క లక్షణము. దుష్యంతుని యందు పెట్టుకొన్నాడు. ఇతని యంతఃకరణ మున్నది. వృత్తియు నున్నది. ఆ వృత్తి ధర్మానుబంధిగా నుండుటచేత అంతఃకరణము విహారిణి కాలేదు, కాదు. దుష్యంతుడు శివైక దేశమని చెప్పిన తరువాత యోగివంటివాడని చెప్పనక్కఱలేదు.

ఈ రెండు లక్షణములు దుష్యంతునియందు విడివిడిగా ప్రవహించుచున్నవి. ఈ జంట ప్రవాహములమీఁద నాధారపెట్టి కాళిదాసు నాటకము వ్రాసెను.

ఈ ప్రవాహములు చమత్కారముగా రెండును విస్పష్టముగా విడివిడిగా నడచును. మఱియొకచోట అదియే యిదియేమో యున్నట్లుండును. ఇవి మూడు దశలు. అదియే యిదియేమో యున్న దశకు నీ యుదాహరణము చూడుము. 'అనుయాస్యన్ మునితనయాం, సహసా, వినయేన వారితప్రసరః, స్థానా దనుచ్ఛలన్నపి గత్వేవ పునః ప్రతినివృత్తః' మునితనయ వెంటపోఁదమని కోరుచు వినయముచేత నడ్డగింపఁబడిన కదలిక గలవాఁడనై యున్నచోటనుండి కదలక పోయినను, వెళ్ళి తిరిగివచ్చినట్లే యున్నది. ఇది దీని యర్థము. దీనికి సజాతీయమైన యిట్టిదే యున్న భ్రాంతి కొలిపెడు పను

భూతి లేశము లోకమునందు పెక్కు రనుభవింతురు. 'ఆ పని చేయకపోయినను చేసినట్లే యున్నదిరా!' అని లోకమునం దనుకొనుట కలదు. ఇట్లెందుకు కనుకొందురు. తత్కార్య మందలి గాఢభావనము చేత ననుకొందురు. గాఢభావన యనగా నేమి? మనోవృత్తిగాని, చిత్తవృత్తిగాని యంతఃకర ణమునకు తాకుట. అప్పుడే గాఢభావన యుండును. కాననే శ్రీ శంకర భగవత్పాదులు దూఢచింతన మన్నారు

తాత్పర్య మేమనగా దుష్యంతుడు శకుంతలా గత మైన భావన చేయుటలో తనను యంతఃకరణమును దాని వృత్తియు రెండును కలిసిపోయినంత తీవ్రమైన అనుభూతి విశేషమును స్మృతిదశయందు గుర్తించి చెప్పినాడు. అను భూతి యంతఃకరణమునందున్నది. ఈ రెంటియొక్క యాను షంగిత్వము విడివిడిగా, సమైక్యముగా, విస్పష్టముగా నా మహానుభావునికి గోచరించుచున్నది.

దుష్యంతు డిట్టివాడని దుష్యంతునకు మాత్రమే తెలి యుట కాదు. ఇది చాల మందికి తెలియును. తెలిసిన వా రిద్దఱీ నాటకములో నున్నారు. 'పశ్యామితావ పినాకినమ్' అన్న మాతునకు తెలియును గదా. మఱియు విదూషకునికి కూడ తెలియును. 'భోః కిమేతత్ అనుపపన్నం ఖల్విదృశం త్వయి కదాపి సత్పురుషాః శోకపాత్రాత్మానో న భవంతి. నను ప్రవాతేఽపి నిష్కంపా గిరయః' ఇదేమిటయ్యా! నీ వంటి వానియం దిట్లు కూడదు. సత్పురుషులు శోకపాత్రాత్ములు కారు. ఎంత పెద్ద గాలికైనను కొండలు కదలునా? షష్ఠాం కములో రాజుయొక్క పరమవిరహదైన్యమును చూచి

విదూషకు డన్నమాట లేదే. సత్పురుషులు దుఃఖమును పొందుదురా! అనుట లోకమందున్నది? నీవన్నియు తెలిసినవాడవు. నీవు దుఃఖపడవచ్చునా అందువు. నీ వంటివాడే దుఃఖపడినచో తక్కినవారేమి కావలయును అనవచ్చును. నీవు ధైర్యవంతుడవు, ఇట్లు కారాదు అనవచ్చును. నీవు సత్పురుషుడవు దుఃఖపడవచ్చునా అని యెంచుదువు? కనుక దుష్యంతుని ఈ శిష్టైకదేశత్వము తెలిసినవారు కలరన్న మాట. సూతుడును విదూషకుడును కనుపించుచునే యున్నారు. ఇది దుష్యంతుని లక్షణము. ఇతర కావ్యనాయకుల వంటివాడు కాడు. కాళిదాసుని గొప్పతన మిచ్చట నున్నదనగా దుష్యంతుని ఈ లక్షణములో నుండి కథానిర్మాణము చేయుటమీద నున్నది. ఈ లక్షణమునుబట్టి రసభంగదోషము రాకుండ చేయుటలో నున్నది.

ఇంకొక్క చిన్న విషయ మిచ్చట చెప్పవలయును. "అనుయాస్య స్మితనయాం" అన్న శ్లోకములో మానవుని తనయొక్క మానసిక ప్రవృత్తి చెప్పుచున్నట్లు నటించి మలినమైన యంతఃకరణ విషయము చెప్పినాడు. అన్నియు నిశ్లేకథాగత విషయములవలె కనుపించును. వెనుకనున్న జ్యోతి ధగధగలాడుచుండును. ఇట్టే చెప్పబోవు విషయములుకూడ పరిశీలించవలయును. షష్ఠాంకమునందు ప్రతీహారి వచ్చి కొన్ని రాజకీయ విషయములు వ్రాసిన పత్రికను రాజున కిచ్చెను. ధనమిత్రు డను సముద్ర వ్యవహారియైన సార్థవాహుడు నౌవ్యసనమందు విపన్నుడైనాడు. అతడనపత్యుడు అతని యర్థసంచయము రాజగామి యగును. ఈ సంగతిని చదివి.

రాజు "పితర్థము సంతానమునకు పోవును ఆ ధనమిత్రునకు మరే కళత్రమునందైన సరే సంతానము కలిగినచో వానికి ధనము పొందించు' మని చెప్పినాడు. ఇచట రాజు శకుంతలా ప్రత్యాఖ్యానముచేత తనయొక్క నిరపత్యత్వము భావించి చెప్పినట్లు కనపించును. కాని దుష్యంతుడు సహజముగా పరమ సత్త్వగుణుడు. కాళిదాసు దానిని గోపనముచేత రాజా సందర్భమునందట్లు ప్రవర్తించుటకు ఆ సందర్భము యొక్క బలము హేతువన్నట్లుగా వ్రాయును. ఇదియొక విశిష్టమైన రచనాశక్తి. సత్ అను పదార్థ మొకటి యంతరమునం నందుండడో వాడు సత్కార్యములు చేయునే కాక, ఒత్తిడి వలన చేసినచో నది బలవంతపు బ్రహ్మాస్త్రార్థముగ కనిపించు చునే యుండును. ఇచట దుష్యంతుడా సన్నివేశ బలముచేత నట్లు చేసినాడనుకొనుట తప్పు. సన్నివేశమట్లు కల్పించుట కవి నెరపిన శిల్పము. ఈ శిల్పము వెనుక దుష్యంతునియొక్క స్వచ్ఛమైన యంతఃకరణము భాసింపచునే యున్నది.



"కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా
తత్రాపిచ చతుర్థోంకః తత్ర శ్లోక చతుష్టయమ్"

అన్న యభియుక్తోక్తి గలదు శాకుంతలమును గూర్చి యిట్టి శ్లోకములు పెక్కు గలవు మరియు 'ఉపమా కాళిదాసస్య' మొదలైన చాటూక్తులెన్నో కలవు. ఆంగ్లేయ విద్యావేత్తలు తిరిగితిరిగి జర్మన్ కవి గథె చెప్పిన 'శాకుంతలము

విషయము ప్రారంభింపబడినది. ఆ గీతిక విని రాజు "అహో రాగపరివాహినీ గీతిః" అనుచున్నాడు. స్థూలదృష్టికి రాగ శబ్దముచేత సంగీతరాగ మని యనిపించును. మఱికొంత విచారించినచో శ్లేషశక్తిచేత హంసపదికయొక్క ప్రేమయని యర్థమిచ్చుచున్నది. మఱియు నధికముగ హంసపదికాదుష్యంతోభయగత రాగాభివ్యక్తి ఈ గీతిక చేయుచున్నదని యూహించవచ్చును. రాజు చిఱునవ్వు నవ్వి ఇట్లనుచున్నాడు. "సకృత్కృతప్రణయోఽయం జనః తదస్యా దేవీం వసుమతీ మన్తరేణ మదుపాలంభ మవగతోఽస్మి. సఖే మాధవ్య! మద్వచనా దుచ్యతాం హంసపదికా నిపుణ ముపాలబ్ధోఽస్మీతి." ఈమెతో నా కొకనాటి పరిచయము గలదు. వసుమతిని గూర్చి యీ గీతితో నన్నుపాలంభించుచున్నది. మిత్రమా! హంసపదికతో నేను చెప్పితినని, నేర్పుగా నుపాలంభించితి వన్నానని చెప్పుము.

హంసపదికయందు రాజునకు ప్రేమ పోలేదు. కృత ప్రణయమైన జనమునం దాతడెప్పుడు నిరాదరణ వహించడు. అందుచేత 'హంసపదికాదుష్యంతోభయగతరాగ' మని చెప్పినది. అట్లు కబురు పంపించెద ననగా 'నిన్ను మఱచిపోలేదు. మఱల నెప్పుడో నిన్ను జూతు' నని వ్యంగ్యము. ఈ సన్నివేశమునందే పంచమాంకకథ యంతయు సప్తమాంకములోని శకుంతలానందయోగముతోపాటు సూచితమగుచున్నది. "రాగ పరివాహినీ గీతిః" అన్న మాటలోని 'రాగ' శబ్దము హంసపదికాగతమైన యనురాగమే కాదు.

తరువాత వచ్చు 'రమ్యాణి వీక్ష్య' మొదలైన పద్యములలో సూచింపబడిన జ్ఞాపకములగాని, అవ్యక్తమైన, జీవగతమైన, అంతఃకరణ నిష్ఠమైన, రాగము కూడ అభివ్యక్తమై నమగు చున్నది.

"సకృత్కృతప్రణయోఽయం జనః" అన్న మాటలో శకుంతలా లక్షణమున్నది. అనసూయ సకృత్కృత ప్రణయయే. హంసపదిక శకుంతలా స్థానీయురాలుగా కల్పింపబడినది. "నిపుణముపాలబ్ధోఽస్మి" లో ఏ ఉపాలంభాంశమునందు శకుంతల చేసిన "క ఇదానీ మన్యో ధర్మకంచుక ప్రవేశినః తృణచ్ఛన్న కూపోపమస్య తవానుకృతిం ప్రవిశతి" అను ఉపాలంభములోని నిపుణత్వము సూచితమగుచున్నది.

విదూషకుడు "గృహీతస్య తయా పరకీయై ర్హస్తైః శిఖండకే అప్సరోభిరివ వీతరాగస్య నాస్తి మే మోక్షః" అన్నాడు. ఆమె ఇతరులచేత నా జుట్టుపట్టుకొని లాగించును. వీతరాగుడైనవానికి అప్సరసల చేతవలె నాకు మోక్షము లేదు. ఇవి మాధవ్యుని మాటలు. కొంచెము శాఖాచంక్రమణమైనను, విదూషకుని స్వరూప మిచట ప్రస్తావింతును. పూర్వ వ్యాసములయందు దుష్యంతుని సత్పురుష లక్షణము తెలిసినవారికి విదూషకుడు ప్రధానుడుగా చెప్పబడినది. మాధవ్యుడు కొన్ని సంస్కృత నాటకములయందువలె మూఢుడు కాడు, ప్రగల్భుడు గాడు. అతడు మహా వివేకి. ఎంత వివేకి యనగా షష్ఠాంకమందు ప్రత్యభిజ్ఞ కలిగిన తరువాత రాజు మిక్కిలి దైన్య మవలంబించగా ఉన్మాదస్థితిని పొందుచుండగా తదున్మాదస్థితిని తెలిసికొన్నవాడై రాజు

భవత్యా నామ- కి మహ ఏవ విస్మృతో నసి త్వ మపి' 'సఖుడా! శకుంతలా ప్రథమ వృత్తాంతము సర్వము నాకిపుడు జ్ఞాపకము వచ్చినది. నీతో చెప్పినాను? ఆమె ప్రత్యాదేశ సమయమునందు మీరు లేరు. పూర్వ మెప్పుడు నీవు ఆమె పేరైన నెత్తలేదు. నావలె నీవుకూడ మఱచి పోయితివా?, అన్నాడు.

రాజు ఇచ్చట రెండుచోట్ల భవచ్ఛబ్దము వాడినాడు. రెండుచోట్ల త్వచ్ఛబ్దము వాడినాడు. త్వచ్ఛబ్దము పరిచయాధిక్యమును సూచించును, భవచ్ఛబ్దముపరిచయముతో గూడిన గౌరవమును సూచించును. విదూషకుడన్నచో రాజునకు ప్రియమేగాదు. చాల గౌరవము గలదు. అప్పుడు విదూషకు డిట్లన్నాడు. 'నవిస్మరామి కింతు సర్వం కథయిత్వా అవసానే త్వయా పరిహాస విజల్ప ఏషః, న భూతార్థ ఇత్యాఖ్యాతమ్, మయాపి మృత్పిండబుద్ధినా తథైవ గృహీతమ్. అథవా భవితవ్యతా బలవతీ' నేను మఱచిపోను, కాని నీవు పరిహాస విజల్పమన్నావు. మృత్పిండ బుద్ధిని నేనట్లే గ్రహించినాను. కానిచో భవితవ్యత బలవతిగదా. ఇవి ఈతడన్నమాటలు. 'నేను మఱచిపోను' అనుటచేత విదూషకుడు తాను తెలివి తక్కువవాడనను కొనువాడు కాడు. మృత్పిండబుద్ధి యను మాట స్వోపాలంభనముగాని వాని మనోగుణముగాదు. మరి యును రాజుతో, అట్టి దుఃఖగతునితో భవితవ్యత బలవతి అనదగిన వాడెంతవాడు! ఏదో అనవలయునుగాని దైవ మపరి

నాటకము జాగ్రత్తగా చదివినచో, శ్లోకము చక్కగా తెలిసినచో నొక విషయము తెలియును. ఇద్దరు స్నేహితు లుందురు. ఇద్దరును మర్యాదస్థులు, వ్యవహారములయందు పరస్పర గౌరవము చెడకుండ మాటాడుకొనుచుందురు నడుమ నడుమ నొక్కొక్కసారి స్నేహగాఢత్వమును పురస్కరించుకొని "ఏరా, ఏరా" యని సంబోధించుకొందురు, దుష్యంత-మాధవ్యుల పరిస్థితి యిది. ఇద్దరును మర్యాదగా మాటాడుచు విదూషకు డేదియో కొంటెమాటలు అనును, రాజును హాస్యముగనే సమాధానము చెప్పును.

అందుకనియే అప్పుడు విదూషకుడు "నేను రాక్షసు లన్నచో భయపడుచున్నా ననుకొంటివేమి!" అని చమత్కారము చేసినాడు. రాజు దానికి "ఎబ్బె, నీ వినయమునో నట్లనుకొనుటయే" అని పరాచిక మాడినాడు.

పై విషయము మందుకొన్నచో హంసపదికాగీతము శకుంతలానుసంధానమునకు చూళికాప్రాయముగా నిక్షేపింప బడినది. అప్పుడు రాజు "కిన్ను ఖలు గీత మేవంవిధార్థ మాకర్ణ్య ఇష్టజన విరహాదృతేఽపి బలవదుత్కంఠితోఽస్మి" ఇట్టి యర్థముగల పాటను విని ఇష్టజన విరహము లేకుండ గనే మిక్కిలి యావేగమును పొందుచున్నా నేమి! అను కొనెను. ఇష్టజన విరహము లేదు. హంసపదిక ఇష్టజనము కాదా! హంసపదిక వసుమతి నుద్దేశించి యాపాట పాడినది. వసుమతి యెవరు! రాజుయొక్క పట్టమహిషియా? అయి నచో హంసపదిక అట్లనలేదు. కావచ్చును. 'కమలవసతి

మాత్ర నిర్వృతిః' అన్న మాటచేత పట్టనుహిషి కూడ గావచ్చును. కాదా వసుమతి యనగా భూదేవియుకూడ, కావచ్చును. ఎవరైన నేమి? ప్రస్తుతము రాజున కాము యిష్టజనము, రాజుయొక్క కోరిక యామెయందున్నది. శకుంతలయందు లేదు. శకుంతల విస్మృతి పథమునందు. పడిపోయినది. అన్న విషయమును 'ఇష్టజన విరహోద్య తేపి' అన్న మాటలో తెలిసిపోయినది. సరే దానితో కథ తునిగి పోయినది. కాని 'బలవదుత్కంఠితోస్మి' అన్నాడు. కథా విషయికమైన యాశాంకుర మేర్పడినది. రాజు శకుంతలను మఱచిపోయినాడు. కాని యీ పాటను వినుటచే వని నిలో నొక గగ్గోలు బయలుదేరినది. ఈ గగ్గోలు సమాజికులయందు మునిగిపోవుచున్న రసభావమును సముద్ధరించుచున్నది. వెంటనే రాజు నే నెవరినైనను మఱచిపోయితినా? అన్న యూహా చేసినచో సామాజికుని యొక్క రసభావము మఱల బ్రతికినది. రాజిట్లనక 'రమ్యాణి వీక్ష్య' మొదలయిన పద్యము చేత హేత్వంతరము కల్పించి కథ మునుగకుండ తెలకుంత పట్టిపెట్టినాడు.

ఈ రీతిగా మునిగిపోవుచున్న కథను, రసమును కాళి దాసు 'రమ్యాణి వీక్ష్య' అన్న శ్లోకముతో సముద్ధరించినాడు. ఈ శ్లోకము రససిద్ధాంతమునకు మహాభాష్యమువంటిది. రస స్వరూపమంతయు దీనియందున్నది. దీని రహస్యమును అభి నవగుప్తపాదుడు నాట్యశాస్త్రమున, రససూత్ర వ్యాఖ్యాన సందర్భమున నిట్లు వ్యాఖ్యానించినాడు.

"వస్తు సతాం కావ్యార్పితానాంచ దేశకాల ప్రమాతృదీనాం నియమ హేతూనాం అన్యోన్య ప్రతిబాధబలాత్ అత్యంత మపసరణే స ఏవ సాధారణీ భావః సుతరాంపుష్యతి. అత ఏవ సర్వ సామాజికానాం ఏక ఘనతా ఇవ ప్రతిపత్తేః సుతరాం పరిపోషాయ సర్వేషాం అనాదివాసనా చిత్రీకృత చేతసాం వాసనా సంవాదాత్. సా చ అవిఘ్నా సంవిత్!"

వస్తురూపముగా దేశము, కాలము, ప్రమాత అనగా గ్రహీత- వీరు కావ్యమునం దర్పింపబడుదురు. ఇవి నియమ హేతువులు. అవి యొకదానికొకటి ప్రతిబంధ హేతువులు. అవి పూర్తిగా తొలగినపుడు సాధారణీ భావము పోషింపబడును. అందుచేత సర్వసామాజికులకు ఏకఘనత ప్రాప్తించును. అందరి చేతస్సులు అనాదివాసనచేత చిత్రీకృతములగును. అదియే అవిఘ్నమైన సంవిత్తు.

సామాజిక హృదయములయందు కాళిదాసు హంసపదికా, వసుమతీ, శకుంతలాది సర్వనాయిక భావాపసర్పణము దుష్యంత భావాపసర్పణము, తద్దేశకాలాపసర్పణము చేసి విస్మృతి పాత్రమైన మనస్సును తొలగించి, చిరంతనమైనయీ సంవిత్తు, అంతఃకరణ నిష్ఠమైనది, జీవసహజమైనది, రసోవై సః' అన్నదానికి లక్ష్యమైనది - ఆసంవిత్తును సామాజికులయందు నెలకొల్పినాడు. అచట నా సంవిజ్జ్యోతి వెలుగుచుండగా, అది ప్రధాన రసస్వరూపమగుచుండగా రసభంగ మెట్లు వచ్చును! కథాభంగ మెట్లు కలుగును! ఇదియే చమత్కారము. ఈ చమత్కార స్వభావము మనసాధ్యవ

సాక్షాత్కారము కాని, సంకల్పము కాని, స్మృతి కాని కావచ్చును, అని అభినవగుప్తుడు. ఇచ్చటనే ఆయన ఈ శ్లోకము నుదహరించుచున్నాడు.

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని.

ఇత్యాది. అత్ర స్మరతీతి యా స్మృతిరుపదర్శితా, సా నతార్కిక ప్రసిద్ధా! పూర్వ మేత స్యార్థ స్యాననుభూతత్వాత్ అపితు, ప్రతిభానాపరపర్యాయ సాక్షాత్కారస్వభావే యమితి. సర్వథా తావత్ ఏషాస్తి ప్రతీతిః ఆస్వాదాత్మా యస్యాం రతి రేవతి భాతి. తత్రైవ విశేషాంతరానుపహితత్వాత్ సా రసనీయా సతీ నలౌకికీ, న మిథ్యా, న అనిర్వాచ్యా, న లౌకికతుల్యా, న తదారోపాదిరూపా!"

రమ్యములైన వానిని చూచి, మధురములైన శబ్దములను విని సుఖితుడైనవాడు కూడ పర్యుత్సుకుడగుచున్నాడు. ఇది యేమి యనగా అది యింది భావస్థిరములైన జననాంతర సౌహృదములైన వానిని, పూర్వము తెలిసికొనని వానిని నిశ్చయముగా మనస్సుతో స్మరించుచున్నాడు. మొదలైనది. ఇచ్చట 'స్మరించుచున్నాడు' అని ఏది స్మృతి రూపముగా చూపింపబడినదో అది తార్కిక ప్రసిద్ధము కాదు ఈ విషయము పూర్వ మనుభవములో లేదు గనుక. మఱి యేమన వలయును? ప్రతిభాన మన్నది. ప్రతిభాన మనగా సాక్షా

ఏ ప్రతిభానము తనయందు రతి నిమిద్యుకొని జీవలక్షణము కలదై యంతఃకరణ రూపమున భాసించుచున్నదో, ఏది రసశబ్దార్థమునకు పర్యాయభూతమైనదో ఆ స్థితికి ఈ పద్యము వ్యాఖ్యానము. ఈ పద్యములో మూడు విషయములు ఉన్నవి. సుఖతుడు- అతని కింకొకదానియందు వాంఛ లేదు. రెండవది పర్యుత్సుకుడు- ఈ పర్యుత్సుకత్వము వాంఛలక్షణము. వాంఛ గలదు. మూడు - ఈ రెంటిని సంయోజనపఱచు వస్తువు మూడవది. అది స్మరణ. స్మరణ యనినంతనే తార్కికముగా పూర్వానుభూతి కావలయును. ఇచట నది లేదు. పూర్వానుభూతి లేని స్మరణ, ఇది అలౌకికము. అందుచేతనే 'లౌకిక తుల్యా' అని చెప్పబడినది.

ఈ స్థితియందు సామాజికులను నిలిపి కవికులగురువు పంచమాంకము నంతయు నడిపినాడు. ఇందుకనియే కవికులగురువు. 'నానృషిః కురుతే కావ్యమ్' అన్నమాట ఇట్టి రచనను గురించి పుట్టినది. గణయతి ప్రాసలు, ఏదోయొక గుణాభాసముచేసి పద్యరచన చేసెడు ప్రతివానిని గూర్చి చెప్పినది గాదు. 'ఋషి ర్ద్రిష్టా' ద్రష్ట యనగా ధర్మము, బ్రహ్మపదార్థము, చైతన్యము, మోక్షము మొదలైన మహావిషయములలోని యొకానొక రహస్యమును దర్శించినవాడు. దానిని దర్శించి జగత్తునందలి మందబుద్ధుల కుపదేశించినవాడు. సజ్జనులు దానిని గ్రహించి తదనుకూలముగా ప్రవర్తించుట దీనికి ప్రయోజనము. లేడి యడవిలో సెలయేట నీరు త్రావుచుండును. ఒక చెంగి దిక్కుంచి యడవిలోని పచ్చిక మేయుచుండును,

ఈ సంగతి వేటకాండ్రు గుర్తింతురు. దీనిని తక్కినవా రెఱుగరు ఇది చెప్పిన వేటకాడు ద్రష్ట కాడు. మానవ ప్రకృతిలో ప్రవర్తనలో, చాల రహస్యములుండును వానిని మహాకవులు చెప్పుదురు. వారు ద్రష్టలుకారు. మొదటిదశ కవి. రెండవది సూరి. మూడవది మహాకవి. నాల్గవది ఋషి. ఈ నాల్గు లక్షణములు సంపూర్ణముగా కలవాడు కాళిదాసు.

ఈ పునాదిమీద పంచమాంకమునందలి శకుంతలా ప్రత్యాఖ్యానము వ్యాఖ్యానింపబడవలయును.

## ౧౦

దుష్యంతునియం దంతఃకరణ నిత్యజాగ్రదవస్థాభూతమైయున్నది. ఈ యంతఃకరణ నాల్గు విధములుగా నుండును. అందులో నొకటి మనస్సు. ఋషి శాపమునకు మనస్సు లగ్నమగును గాని తక్కిన యంతఃకరణము మీద నా శాపము పనిచేయదు. ఆ యంతఃకరణము మేల్కొనియే యున్నది. ఈ శాపబలమున రాజు శకుంతలను మఱచిపోయినాడు. ఈ సందిగ్ధమైన స్మృతియే యీ నాటకమునందు రస భంగము కాకుండ, దుష్యంతుని శీలభంగము కాకుండ, నాటకమునందలి నాటకత్వము చెడిపోకుండ రక్షించుచున్నదని పూర్వము చెప్పబడినది. దాని స్వరూపము ప్రపంచించబడును.

మునిశిష్యులు, గౌతమియు శకుంతలయు వచ్చిరి. రాజు శకుంతలను చూచెను. తక్కినవారిని చూచెను. వారెందుకు వచ్చిరో తెలియదు. మునిశిష్యులెందుకో వచ్చిరి. గౌతమి యెందుకు వచ్చినది? ఆ వృద్ధురాలు రావలసిన యవసరము లేదే! మరియు వారివెంట శకుంతల యున్నది. రాజను కొన్నచో నీ వృద్ధురాలెందుకు వచ్చినది యని కూడ ననుకొనవలయును. ఆ ప్రసక్తి లేదు. శకుంతలను చూచినాడు, ఆమెనుగూర్చి యనుకొన్నాడు. ఈమె యెవరు? ఈమె యెందుకు వచ్చినది? అని సామాన్యముగా ననుకొన్నచో సంగతమయిన మాటయే యగును. అట్లనుకొనలేదు. ఇట్లను కొనెను. 'అథాత్రభవతీ, కాస్విదవగుంఠనవతీ నాతిపరిస్ఫుట శరీర లావణ్యా, మధ్యే తపోధనానాం కిసలయమివ పాండు పత్రాణామ్.' 'మరి యీ పూజ్యురాలు పాండుపత్రముల మధ్య కిసలయమువలె తపోధనులమధ్య నాతిపరిస్ఫుట శరీర లావణ్యయై యవగుంఠనవతియైన దెవ్వరు?' (నిజముగా నీ పద్యము "అత్రభవతీ" తో గలిపి తెనుగుచేయుట సాధ్యము కాదు) ఇదియొక్క విచిత్రమైన శ్లోకము. ఈ శ్లోకమునందలి భిన్నభాగముల నొకదానితో నొకటి సమన్వయపరచుట క్లేశ మొనరించును. ఆమె శరీర లావణ్యము అతిపరిస్ఫుట ముగా లేదు. కారణమేమిటి? అవగుంఠనవతి యగుటచేతనా? తపోధనులమధ్య నుండుటచేతనా? తెలనగా పండుటాకుల నడుమనున్న చిగురుటాకు కనిపించును, కనిపించదు. ఆ చివు రాకుయొక్క సొగసు పరిస్ఫుటముగా నుండదు. పైగా నా శరీరలావణ్యము నాతిపరిస్ఫుటము, పరిస్ఫుట మగుచునే

యున్నది. అతిపరిస్ఫుటమగుట లేదు. అంతఃకరణమునం దామె స్థితి పరిస్ఫుటముగానేయున్నది. మనస్సునకు తగుఅంటలేదు. అందుచేత నాతిపరిస్ఫుటము. ఆమె యువకుంతనవతి. సహజమే. తా నీ యువకుంతనము లతుణతః శాపముచేత కలిగిన మనస్సుయొక్క క్రమిస్మికరూ కను. ఈమె తపోధనులమధ్య నున్నది. ఆమె తపోధరాలు కాదు, వారియందు కోరికలు నశించియున్నవి. వాంఛ లస్తమించినవి. ఈమెయం దట్లు కాదు. అందుచేత వారు పండుటాకులు! ఈమె చివురాకు. వారికి కర్మ పరిపాకమయినది; ఈమెకు కాలేదు. ఈమెకు కర్మ పరిపాకము కాలేదు కనుక నీమె కేదో యాపద రాబోవుచున్నదా! తా నీమెను పరిత్యజింపబోవుటచేత నామెకు కలుగబోవు దుఃఖము దీనియందు సూచితమగుచున్నదా!

ఇది యంతయు నటుఅంచి సామాన్యముగా నీమె యెవ్వరన్న ప్రశ్నపోయి యీమె లావణ్యవతి యన్న విషయము తన కెందుకు? ఆమె యవ్యక్త సౌందర్యమును వర్ణింప వలసిన స్థితి తన కేమి పట్టినది? అథాఽత్రభవతీ, ఇచ్చట 'అథ' యన్న యవ్యయమున్నది. 'మంగళానంతరారంభ ప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ;' ఈ 'అథ' యన్న యవ్యయము మంగళార్థమునందు తరువాత నన్న యర్థమందు, ప్రారంభించుట యనునర్థమునందు ప్రశ్నయందు, సమస్తమునను నర్థమునందు వచ్చును. ఇచ్చట ననంతరార్థము పట్టదు, దేని తరువాత? ఏదియు మొదలుపెట్టబడలేదు. కనుక తరువాత లేదు. ఆరంభార్థము మిక్కిలియు పొసగదు, 'కాస్విత్' అని యుండుట

చేత ప్రశ్నార్థకముగాను కాలాన్యర్థము కూడ పొసగదు. మిగిలినది మంగళార్థము ఇచ్చుటయన్న రహస్యమిది. పైకి వాక్యాలంకారమువలె భాసించినను, అదియంతయు రాజు యొక్క యంతఃకరణము ప్రవర్తించుచున్నది. మనస్సు కాదనినచో వచ్చిన నష్టములేదు. నిజము కొంతకాల మీ వియోగము జరుగునేకాని చివరకు రాజు నామెను స్వీకరించుట నిస్సంశయముగా జరుగును. ఏకమంగళార్థసాధకమైనది యీ "అథ" యవ్యయము.

ఇది వట్టి శబ్దప్రయోగ రమణీయత మాత్రమే కాదు. ఏ స్త్రీ యందు మానవుని కభిలాష కలుగునో ఆ స్త్రీ యొక్క సౌందర్యమునే మానవుడు వర్ణించును. పైగా దుష్యంతుని యొక్క శకుంతలాగతమైన వాంఛ మొదటినుండియు నిట్టి యూహలై ఖరిసి యవలంబించినది. 'అక్కస్మాత్పరిపతితం చ్యుతమివ నవమాలికా కుసుమమ్' మొదలగు యూహా సామగ్రి దుష్యంతుని వాంఛాప్రకటన లక్షణము లయియున్నది. ఆయన మనస్సు చొచ్చినచోట అతని యూహ యట్లే యుండును. అందుచేత నిచట శకుంతలాభిలాషము సువ్యక్తము. మన మాయన నెఱుగుదుము. ఆయన కోరిక అట్లే యుండును లోకముగూడ "ఎవరీబాలా అమ్మాయి ఇంత యందముగానున్నది" యన్న మాటలో హృదయాంతరగతాభిలాషాలేశము లేకపోలేదు.

రాజు పొందిన యీ యభిలాష యభిలాష కాదు. వట్టి ప్రశ్న యనుకొందుమా, అనుకొనుటకు వీలు లేదు. రాజు నామెయం దభిలాష పొందుచున్నాడని ప్రతీహారి గ్రహించి

యుపాధ్యాయులు పంపించిన సందేశమేమో లోకపాలకులట. తమరు వినవలయును," అనగా రాజు 'అవహితోఽస్మి' యన్నాడు. నే నవహితుడనయి యున్నాను. ఈ మాటకు సామాన్యార్థ మేమనగా చెప్పుమనుము. వినెదను. నేను వినుటకు సిద్ధముగా శ్రద్ధావంతుడ నయి యున్నాను. కాని ఈ మాట వెనుక, తత్పూర్వము పొందిన కలవరమునుండి తేరుకొని యున్నా ననికూడ అర్థము. దానిని గురించి విచారించుట కిపుడు వ్యవధిలేదు. కాని తప్పకుండ వారియందలి గౌరవముచేత దానిని వదలిపెట్టి దీనియందు వ్యగ్రుడ నయి యున్నానని యర్థము. ఈ యర్థమంతయు మనస్సులోని పొరలు వాని మెలికలు, లోన వేయిమెలికలుండగా నొక ప్రధాన విష మందు తత్కాల వ్యగ్రత కాంచు మనోలక్షణము భాసించిన వారికే తెలియును.

ఇచ్చటినుండి కాళిదాసు ప్రసంగము చాలచమత్కారముగా నడిపినాడు. రాజుయొక్క మనస్సు నిద్రపోవుచున్నది. ప్రమాదము పొందియున్నది. ఒకడు పొరపాటు పడినాడు, వాని పొరపాటును సుకుమారములయిన వాక్యములచేత లాలనచేత అభ్యర్థనచేత నది పొరపాటని నిరూపించుటకు యత్నించినచో వాడది పొరపాటని యొప్పుకొనినచో నొప్పుకొనును. వానిని నిందించినచో, వానిమీద ధార్ష్ట్యము నెఱపినచో వాడు మఱియును బిగియును. తనది పొరపాటని యంతరాంతరమున నెఱుకొనుచున్నను పైకి ససేమిరా యని యొప్పుకొనడు. ఇది లోకమునందలి మానవలక్షణము. కాను

యైహిక సంబంధములు కించిత్కరములు. వారి యాత్మలు వారికి తెలియకుండ, వారి మాటలు వారికే తెలియకుండ, దైవము ననుసరించును. రాజు కొలువులో రాజుతో మాటా డుచు వారు స్వీకరించిన వాక్యోపన్యాసవైఖరి పైకి లోక వృత్తమువలె నుండును. పైకి ధర్మాంగజనితకోపలక్షణముగా నుండును. పైకి వారు పట్టణ నాగరకత సేవగించుకొన్నట్లు కనిపించును.

కాని పైన చెప్పిన నిగూఢమయిన మానవుని యీ మనస్సునపడిన పొరపాటు తీవ్రవాక్యములచేత తన్నుదా నంగీక రింపచేయని మానవ స్వభావగత విచిత్రలక్షణమును కాళిదా సుని శిల్పమయిన కావచ్చును, దాని వెనుకనుండ నున్న పరమ రహస్య మేమనగా వారందరును ఋషులగుటచేత దైవ మెట్లున్నదో యట్లు జరుగుటచే వారి వాక్యముల ధోరణి సహాయపడును. ఇది ఈ యంకమునందలి ప్రసంగ కల్పనా చాతుర్యమునందలి పరమ రహస్యము.

ఈ శిల్పరహస్యము మార్గాంతరోపన్యాసముచేత మరియు సువ్యక్తమగును. ఆ వచ్చిన ముని శిష్యులు శమద మాది సంపత్తికలవారు. వారు వచ్చుచునే రాజధానియందలి పరిస్థితులకు సేవగించుకొన్నారు. "అభ్యక్త మివస్నాతః శుచి రశుచిమివ ప్రబుద్ధ ఇవ సుప్తమ్. బద్ధమివ స్వైరగతిః జనఇవ సుఖిసంగిన మవైమి." వారు సమభావముతో చూడలేదు. భేదభావముతోడనే చూచిరి. దానితో రాజుతో విపరీతముగా మాటాడుట జరిగినది. రాజు శకుంతలయందు ప్రసన్నుడగుట

జరుగలేదు. దానిచేత శకుంతలా ప్రత్యాఖ్యానము మిక్కిలి దుఃఖహేతువైనది. ఇట్లగుట శివిస్మృతులలో జరుగబోవు శకుంతలా ప్రత్యభిజ్ఞాన జనితమైన రాజుయొక్క యనుతాపా దులు లేదనంతరమైన వారి సంగమమును పరమ మధురము లయినవి. ఈ మునిశిష్యులు సామమార్గము నవలంబించినచో రాజుకూడ సామమార్గమున 'అయ్యా! తమవంటివారు చెప్పుచుండగా నేను కాదనలేను, కాని నా మనస్సు స్మరిం చుటలేదు. ఆమె నిచ్చటనుంచి పొండు. నాకు స్మృతికలుగు నేమో చూతును. లేదా మీరు మీ వెంట తీసికొనిపొండు. నాకు ప్రత్యభిజ్ఞ కలిగినచో నేనే యామెను తోడితెత్తును. నన్నీ విషయమున క్షమింపుడని మహర్షితో చెప్పుడు. మీ రింత గట్టిగా చెప్పుచున్న విషయము నేనుమఱచిపోయినదియే మైయుండవలయును. ఇట్టి విషయము నేను మఱచి పోవుట జరిగినచో నెట్లు జరిగినదో నాకే తెలియకుండనున్నది. మీరు త్రికాలవేదులు. మీరు చూచి నాకు చెప్పవలసినది' యిట్టి ప్రసంగము రాజు చేసియుండవచ్చును. చేసినచో ప్రత్యాఖ్యానమువలన జరిగిన దుఃఖము సగానికి సగములేదు. ప్రత్యభిజ్ఞానమువలన జరిగిన యనుకంపాతిశయవలన కలిగిన సుఖములో నాధిక్యము లేదు. ఇవియన్నియు నట్లుకాక కావ్యము నందున్నట్లు జరుగుటకు మునిశిష్యుల నీ పట్టణవాసమునందలి భోగములయందలి వైముఖ్యము, వారు రాజును తిరస్క రించి మాటాడుటయు హేతువయినది. ఇది ఈ యంకములో కాళిదాసు చేసిన పరమ రసానుకూలమయిన కల్పన.

'ఈమె నీ భార్య' మొదలయిన యుపన్యాసము జరుగగా, రాజునకు నమ్మకము లేకపోగా, గౌతమి యామె యవకుంఠనమును తొలగించగా. రాజు శకుంతలను నిర్వర్ణించిచూచి తనలో నిట్లనుకొన్నాడు.

ఇద ముపనత మేవం రూప మక్లిష్టకాంతి
ప్రథమపరిగృహీతం స్యాన్న వేత్యవ్యవస్యన్!
భ్రమర ఇవ విభాతే కుందమంతస్తుషారం
నచ ఖలు పరిభోక్తుం నైవ శక్నోమి హాతుమ్॥

ఈ రీతిగా నుపస్థితమయినది; ఇంత ప్రశంసింప తగిన సౌందర్యము కలదియైన యీ రూపము ఇదివఱకు నాచే గ్రహింపబడినదా; లేదా! యని నిశ్చయింపలేకున్న వాడనై ప్రాతఃకాలమునందు వానమంచుగల మల్లెపూవును భ్రమరమువలె అనుభవించుటకుగాని వదలిపెట్టుటకుగాని శక్తుడను గాకున్నాను.

ఈ శ్లోకమునందుకూడ 'కాస్విదవకుంఠనవతీ' త్యాది శ్లోకమునందు చెప్పబడిన సర్వమయిన వ్యాఖ్యయు అనుసంధితమగును. అగుచుండగా నంతకంటె నామెను జూచి నప్పటి వేళయందుకంటె నధికముగా రాజుయొక్క యంతఃకరణము ప్రబోధ మందినది విస్మృతి మనస్సంబంధః అంతఃకరణశక్తి మనశ్శక్తికన్న నధికమయినది. ఆ మనస్సంతఃకరణములోని యొక భాగము. దానికున్న బలముదీనికుండదు.

మనస్సుయొక్క బలమేమిటి? దానిబల మెచ్చటినుండి వచ్చినది? లోకవృత్తమునుండి వచ్చినది. మనస్సుయొక్క

సంపూర్ణమైన బలము లోకమునందలి అనంతములగు విషయములయొక్క పరిజ్ఞానముచేత లౌకికములైన ధర్మాధర్మ విషయములయొక్క పరిజ్ఞానముచేతవచ్చినది. లౌకికునియందు మనస్సుయొక్క బలమే యెక్కువ పనిచేయును. యోగికి అంతఃకరణ ప్రవృత్తియే అధికముగా పనిచేయును. రాజు పరమలౌకికుడు. యోగికాడు. కాని యోగ్యుడైన సత్పురుషుడు. సామాన్యులయిన లౌకికులయందు అంతఃకరణము ప్రబుద్ధమయి యుండదు. సత్పురుషులయందు అంతఃకరణము ప్రబుద్ధమై యుండును. యోగులకు సత్పురుషులకు భేదమేమనగా యోగులంతఃకరమునందు ప్రబుద్ధులయి యుందురు. సత్పురుషులయం దంతఃకరణము ప్రబుద్ధమై యుండును. అంతఃకరణము ప్రబుద్ధమైన సత్పురుషులు యోగులకు లౌకికులకు నడిమివారు. అంతఃకరణము ప్రబుద్ధమైన సత్పురుషుం ధర్మమునందు సంచరింపరు. ధర్మాధర్మములను చెప్పునది మనస్సు. దుష్యంతుడీవిధమయిన వ్యామోహముతో తగుల్కొని యున్నాడు. అంతఃకరణమిది ప్రథమపరిగృహీత యని చెప్పుచున్నది. ధర్మాధర్మ విచారణవ్యగ్రమయిన మనస్సు ధర్మనిర్ణయము చేయలేకుండ నున్నది. లౌకికముగా చేసినది. ఇది యధర్మమని చెప్పుచున్నది. ఈ మనస్సుతో గూడియున్న యంతఃకరణము భ్రమరమువంటిది. మనస్సు పనిచేయని యంతఃకరణమునకు భ్రమలక్షణము లేదు. దానియందు రెండు రేఫములు కలవు. భ్రమరశీలమయినది యన్నమాట నట్లుంచి భ్రమర మన్నను ద్విరేఫమన్నను నొకటే. దానియందు రెండు రేఫము లుండుట, 'రఃపుమాన్

పావకే కామే ఈశయే వ్రజే శయో రుతౌ" అని నానార్థ రత్న మాల 'అ' అను అక్షరమునకు నిన్ని యర్థములు కలవు. ఇది యగ్నియందును మన్మథునియందును వర్తించును. రెండు రకారములలోని యొక రకారము మన్మథు డన్నది తెలియుచునే యున్నదికదా. రమణశీలమయిన మనస్సనుజ్యోతిరూపమయిన యంతఃకరణము నీ రెంటియొక్క యేకత్రస్థితి భ్రమరశబ్దముచేత సూచిత మగుచున్నది. కాళిదాసు శబ్దము వచ్చుట సంభోగమునకే వినియోగించెను. మఱియు 'విభాతే' యన్న శబ్దమునకు ప్రభాతకాలమునందు నని యర్థము. ఈ ప్రత్యభిజ్ఞాన మహావిషయమునం దీ సన్నివేశము ప్రభాతవేళ వంటిది. ప్రొద్దెక్కును: మల్లెపూవుయొక్క అంతస్తుషార లక్షణము పోవును. ఆ మల్లెపూవు పరిభోగయోగ్యమగును. అది అంతస్తుషారము. తుషార మనగా తప్తమ్ తోషయతీతి తుషారః' తపించినవానిని సంతోషపెట్టునది. అయినచో భ్రమరము తప్తముకాలేదు కనుక, ఆశ్లే రాజును దానధర్మ భావముచేత తప్తుడు కాలేదు అందుచేత తుషారము పని చేయుటలేదు. కాని యది తుషారమే. సంతోషింప జేయు నదియే. తుషారమనగా మంచు. నీటితుంపురులు. ఈ శబ్దము చేత శకుంతల గర్భవతి యన్న యర్థమున్నది. రేపు ప్రొద్దున నీ గర్భమే, యీ తుషారబిందువే, భరతునిగా సాక్షాత్కరించి అనపత్యతచే తప్తుడయిన దుష్యంతుని సంతోషపెట్టగలుగుటయే. అందుచేత నది 'తుషారమే.

ఆ కాళిదా సొక్కమాట వేసినచో నది యిట్లుండును.

శ్లోకాదియందు నాయికయొక్క రూపము 'అక్లిష్ట కాంతి'యని చెప్పబడినది. ఆ మాటలో చమత్కారమున్నది. కాంతి యనగా కోరబడుచున్నది యని యర్థము. ఆమె క్లేశము లేకుండ కోరదగినది. ఆ రూపమునందలి వాంఛ కాను కూల్యమున్నది. ఆమె తన భార్యయే. లేనిచో నామె రూపము తన్ను ల్లాకర్షించదు. సామాన్యముగా అక్లిష్టపు కాంతియనగా అనవద్యమయిన సౌందర్యమని సాహిత్యవిష యికమయిన యర్థమే. అంతర్వర్తియై యీ విశేషార్థము భాసించుటకే 'అక్లిష్ట' శబ్ద ముపయోగింపబడినది. లేనిచో కాంతియన్న శబ్దమునకు అక్లిష్టమన్న విశేషణ మెవ్వడు వేయును?

'నచ ఖలు పరిభోక్తుమ్' - 'పరిభోక్తుమ్' అన్న క్రియ వాడుటచే రాజుయొక్క వాంఛాధిక్యము భాసించుచున్నది.

అన్నిటికంటె 'కుంద'మన్న శబ్దమున్నది. 'కు' భూమిని 'ద్యతి' చీల్చునది. మొల్లతీగ పుట్టునపుడు భూమిని చీల్చు కొని వచ్చుచున్నదని వ్యుత్పత్త్యర్థము. శకుంతలను కుంద ముగా చెప్పినాడు. ఆమె తన యంతఃకరణమునుండి మన స్సును చీల్చుకొని వచ్చుచున్నది. ఆమె తన పరిగ్రహముగుట రొక్క లక్షణ మట్టిది. కాని యీ మనస్సుయొక్క విస్మృతి యంతస్తుషారమయి వారించుచున్నది.

ఈ తుషార మంతర్వర్తియగుటలో విశేషమున్నది. ఆ తుషారము భరతస్థానీయమని చెప్పబడినదికదా. దానివే పురోహితుడు తరువాత "త్వ మవతనీవు చక్రవర్తిని కందువని

సాధువులు చెప్పిరికదా! ఈ ముని దౌహిత్రుడు లక్షణోపపన్నుడయినచో నీవామెను స్వీకరింపవచ్చు" నన్నాడు. ఇప్పుడు తుషారము కందముయొక్క అంతర్భాగములోన నున్నదనుట లోని సౌందర్యము చూడవచ్చును.

ఈ రీతిగా రసభంగము కాకపోవుటకాదు, శృంగార రసము మిక్కిలి పరిపుష్టమగుచున్నది. వీనిచేత ప్రత్యాఖ్యాన మునందు బాధ యధికమగుచున్నది.

రాజెంత బాధపడుచున్నాడో యీ క్రింది యాయన యుపన్యాసముచేత తెలియగలదు. ఈ యుపన్యాసము, మరి తరువాత వచ్చు శ్లోకము రెండును చాల విచిత్రముగా నున్నవి. "కిమిదం జోషమాస్యతే" ఏమయ్యా మాటలాడవు అని శార్ఙ్గరవుడనగా రాజు "భోస్తపోధన! చింతయన్నపి నఖలు స్వీకరణ మత్రభవత్యాః స్మరామి, తత్కథమిమా మభివ్యక్త సత్త్వలక్షణాం ప్రతి ఆత్మానం క్షేత్రిణ మాశంకమానః ప్రతిపత్స్యే" అయ్యా! తపోధనుడా! ఎంత యాలోచించినను ఈ పూజ్యురాలిని నేను గ్రహించుట నాకు జ్ఞాపకమునకు వచ్చుటలేదు. అభివ్యక్త సత్త్వలక్షణయైన ఈమెనుగురించి నేను ఈమెకు భర్తను అన్న విషయమును భావించెడివాడ నెట్లు కాగలను. లేదా దానిని గురించి సందేహపడెడువాడ నుగా నెట్లు కాగలను!

"అత్రభవత్యాః స్వీకరణమ్ నస్మరామి" ఈమెను నేను స్వీకరించుట నాకు జ్ఞాపకములేదు, "అత్రభవతీ మయా స్వీకృతేతి నప్రతిప్రత్స్యే." ఈమె నా చేత పరిగ్రహింపబడిన

దన్న విషయము నాకు తట్టుటలేదు. అని చెప్పుట వేరు. ఇచ్చటనున్న "స్వీకరణ మత్రభవత్యా నస్మరామి" యన్న దాని యర్థము వేరు. ఆ విషయము నాకు తట్టుటలేదు—అన్న దానిలో నున్నంత మూలవిచ్ఛేదము. 'ఆమెను నేను స్వీకరించుట నాకు జ్ఞాపకములేదు' - అన్న దానిలో లేదు. స్వీకరించినమాట నిజమే కావచ్చును. కావచ్చునుగాదు, నిజమే అని నా యంతరాంతరములో ఎచ్చటనో ఉన్నది. అని నా యంతఃకరణము చెప్పుచున్నది. కాని నా మనస్సునకు తగులుట లేదు.

ఆ వాక్యములోని గమసూచన యిది. "తత్కథమిమాం" మొదలగు వాక్యము డొంకతిరుగుడు వాక్యము. సూటిగా చెప్పినది కాదు. "నిజమేనయ్యా, ఆమె యేమో గర్భవతి యాయెను. నేనీమెను భార్యగా చేసికొంటినని నే నడుమానపడెడి వాడనగుట యే రీతిగా పొందగలను. అన్న వాక్యము ఇష్టమా యనిష్టమా! లోన వానియన యెంత బాధ పడుచున్నాడు. గట్టిగా చెప్పలేకుండ నున్నాడే! విచిత్రముగా నున్నది యీ రచన. శార్ఙ్గరవుడు శారద్వతుడు తూలనాడిరి. శకుంతల నీకిది న్యాయము కాదన్నది, రాజిట్లన్నాడు.

"వ్యపదేశ మావిలయితుం కిమీహసే జనమిమంచ పాతయితుంకూలంకషేవసింధుః ప్రసన్నమంభ స్తటతరుంచ"

"నా కులప్రసిద్ధిని పాడుచేయుట కెందుకు కోరుచున్నావు! నన్ను పతితుని చేయుట కెందుకు కోరుచున్నావు!

ఒడ్డు లోఁగొనికొని ప్రవహించు ప్రవాహము తేటయిన నీటిని ఆవిలము చేయునట్లు, ఒడ్డుననున్న చెట్టును పడద్రోసినట్లు.'

ఇది యేమి సమాధానము! ఆమెయందు తనకుగల కోరికను రాజు దాచుటలేదే! ఆమె మహాసౌందర్యమునకు తాను ముగ్ధుడనైనట్లు రాజు చెప్పివేయుచున్నాడే! ఆమె శీలమునందు తనకు అనుమానమున్న ప్రసక్తియే లేదే. మొదటి నుండియు నామె - "అత్రభవతీ" - పూజ్యురాలని చెప్పుచున్నాడు. చివర కామెను కూలంకషమైన సింధువనుచున్నాడు. ఆమె యొక మహాప్రవాహము. పరమ పవిత్రమయినది. జగదుద్ధారకమయినది. కెలని భూములకు సస్యదాయినియైనది. కాలుష్యమును కడిగివేయునది, మహాపర్వతములమీద జన్మించినది. తనకేమి భయము! తన కులప్రసిద్ధి పోవునని, తానామెను స్వీకరించుటచేత అధర్మమాచరించినవాడగుదునని. కూలంకషమైన సింధువుచేత ప్రసన్నమైన జలమావిలమగును. మరికొంతసేపటికి తేటకొనును. తన వంశమునకు వచ్చిన నష్టములేదు. తన వంశమునకు వచ్చెడి అప్రసిద్ధి తాత్కాలికము. పడిపోయిన చెట్టు మరల బ్రదుకదు, నిలువదు. ఆయన కెక్కువ భయము, తాను పతితుడనగుదునని. అధర్మము చేసినవాడ నగుదు నని. ధర్మాధర్మములు లౌకికవిషయములు. తత్ఫలితము పారలౌకికమయినచో కావచ్చును. తద్విచారణయు, చర్చయు లౌకికమయినవి. ఇది మనోవిషయమని పూర్వమే చెప్పబడినదిగదా. తన విస్మరణ మనోవిషయము.

ఈ రీతిగా సర్వము సువ్యక్తముగా నున్నది. రస భంగములేదు, కథావిచ్ఛిత్తిలేదు.

ఈ మాటలను శకుంతల యెంత చక్కగా అర్థముచేసి కొన్నది! ఆమె అన్నదిగదా "యది పరమార్థతః పరిపరిగ్రహశంకినా త్వయేదం ప్రవృత్తమ్, అభిజ్ఞానేనానేన తవసందేహమపనేష్యామి" నిజముగా నీకు నేను పరభార్యనని యనుమానమున్నచో, ఇదిగో, యీ గుర్తు చూపించి నీ యనుమానము తీర్తును. అపుడు రాజు "ఉదారః కల్పః" "క్షేమయినపని. అంత కన్న కావలసినదేమున్నది" అన్నాడు.

ఇంతవఱకు కథ న్యాయముగా జరిగినది. ఇచ్చటి నుండి యడ్డము తిరిగినది. ఇతఃపూర్వము శాపముయొక్క లక్షణమే. ఇచ్చటినుండి శాపము పనిచేయ నారంభించినది.

ఈ అంకముయొక్క పరాకాష్ఠ

"మయ్యేవ విస్మరణదారుణ చిత్తవృత్తౌ
వృత్తం రహః ప్రణయ మప్రతిపద్యమానే
కోపా ద్భ్రువోః కుటిలయో: అతి లోహితాక్ష్యాః
భగ్నం శరాసన మివాతిరుషా స్మరస్య"

ఈ శ్లోకములో నున్నది.

ఇంతవరకు రాజు తనకు తెలియకుండ తన యంతఃకరణ ప్రవృత్తి లక్షణములైనవియు, సహజముగా శకుంతలయందు తనకుగల యనురాగము తనకు తెలియకుండ జేయునవియు నైన వాక్యములతోడనే మాటాడెను. ఈ శ్లోకార్థము వాని కంటె భిన్నమైనది. దీని తాత్పర్య మిది: విస్మయదారుణ

చిత్తవృత్తినైన నేను, రహః ప్రణయ వృత్తమును తెలిసికొన లేక యుండగా అతిలోహితాక్షియైన ఈమెయొక్క వంకర లైన కనుబొమలయొక్క భేదముచేత మిక్కిలి కోపము కలిగిన మన్మథునియొక్క ధనుస్సు భగ్నమైనదా అన్నట్లుండెను. ఇది దీని యర్థము. శ్లోకమునందలి పూర్వార్థమున 'విస్మరణ దారుణ చిత్తవృత్తినై నేను ఈ రహః ప్రణయ వృత్తమును తెలిసికొనలేక యుండగా' అన్న విషయమే చమత్కారముగా నున్నది. 'నేను విస్మరణ దారుణ చిత్తవృత్తిని. అందుచేత నాకు జ్ఞాపకము వచ్చుటలేదు' అను నర్థ మిందులో నున్నదిగదా! అనగా నేను మరచిపోయితిని అని యర్థము. మఱచిపోయినవాడు తానా విషయమును మఱచిపోయితి ననుట యెట్లు? ఇది పొసగుటలేదు, కాదా, ఇక్కడ ప్రయోగించిన సతిసప్తమికి నింత యర్థమువచ్చునా యని ప్రశ్న. ఈ వాక్య మిట్లుండునా? ఈమె కోపమును చూచినచో నిజముగా నీ రహఃప్రణయమును నేను మఱచిపోయితినేమో అన్నట్లున్నది. అన్న వాక్య మధిక సమంజసము. ఇట్టి వాక్యముచేత ఆమెయొక్క కోపప్రకటనమునందలి యాదార్థ్యము వ్యజ్యమానమగును. మరి ప్రస్తుతమున్న వాక్యమున కర్థమేమి? ఎట్లును పొసగునట్లు కన్పించదు. అప్పుడు సతిసప్తమికి విశేషార్థము చెప్పవలసియుండును. సామాన్యముగా సంస్కృతభాషలో సతిసప్తమిని తత్పూర్వమునందు గతించిన విషయమును చెప్పుటయం దుపయోగించుటగల్లదు. కార్యకారణములందు కారణము సతిసప్తమియందు చెప్ప వచ్చును. అది యట్లు జరుగుచుండగా నిది యిట్లు జరిగినదని

యను నర్థమునందే దీనియొక్క బాహుళ్య ప్రయోగముకలదు. ఇచ్చట నట్లు కాదే? ఇచ్చటగూడ పూర్వమువలెనే యితని అంతఃకరణాభిజ్ఞానము వేఱు, మనస్సుయొక్క ఆదేశము వేరు. దాని యభిజ్ఞ వేఱుగా విస్పష్టముగా భాసించుచున్నది. సామాన్యమైన వాక్యోపన్యాస వైఖరి ఇట్లుండనే కూడదు. దీనివలన తాను తద్రహః ప్రణయమును విస్మరించితినని తానొప్పుకొనుచున్నాడు. కాని పాఠకుని శ్రోతను మరియొక విధముగా నీ పదార్థమును భావింపుడని చెప్పునట్లున్నది. పరంపరగా గ్రంథము చదువుకొన వచ్చును, కథాంశములు విస్పష్టములైనవిగా కనుపించుటచేత, పాఠకులు తత్సందర్భోచితమైన అర్థమునే చూతురు. అచ్చటనున్న వాక్యమున కెంత యర్థమని విచారించరు. అక్కడనున్న వాక్యార్థము వేఱు. కథా సందర్భమునుబట్టి పాఠకుడు భావించెడి యర్థము వేరు. దీనిని కావ్యదోషములందు నేయార్థమని చెప్పుదురు. ఆ నేయార్థము మహాకవుల విషయములో జరుగదు. ఇక్కడ జరుగుచున్నది. ఇది కాళిదాసుని దోషము కాదు. బహుసంఖ్యగల పాఠకుల దోషము. ఈ పద్యముయొక్క యర్థము యథార్థముగా జెప్పికొనినచో నీ విమర్శ మొదటినుండియు, మరియు నీ పంచమాంకముయొక్క మొదటినుండి, ద్వైధీభూతమైన- అంతఃకరణ ప్రతిపాదనశీలమును, విస్మృతిపాత్రమైన మనో లక్షణమును భాసింపజేయుచునే యున్నది. ఆ దృష్టితో చూచినచో ఈ శ్లోకమునందలి కాళిదాసునియొక్క శిల్పము, పద్యరచనాగత శిల్పము, పరమ నిగూఢార్థ ఘటనా సామ

ర్థ్యము వ్యక్తమగును. ఇది సర్వథా మహాకవుల లక్షణము:
వారు సామాన్యముగా కథాగమనానుబంధిగా లోకసాభి
ప్రాయానుసారముగా పద్యమునందలి భావమును పెట్టినట్లు
కనిపింపచేసి, గాఢముగా నాలోచించువానికి దాని వెనుక
నున్న యేదో పరమరహస్యమును నిర్భర వృత్తితో అనుసం
ధింతురు. మరియు నీ యర్థమునే శ్లోకముయొక్క యుత్తరా
ర్థమునందలి యుత్ప్రేక్షచేత మరల సాధించుచున్నాడు. ఆమె
యొక్క భ్రూభంగ మెట్లున్నది? మిక్కిలి కోపముచే మన్మథుని
యొక్క ధనుస్సు భగ్నమైనదాయన్నట్లున్నది. భగ్నమైనదా?
భగ్నమైనదా యన్నట్లున్నదా? ఈ రెంటికిని భేదమున్నది.
భగ్నమైన దన్నచో నింకేమియున్నది? కథయే పోయినది.
మన్మథునియొక్క ధనుస్సు భగ్నమైనదనగా నితడు భర్త
కాడు, ఆమె భార్యగాదు, శృంగారరసధార విచ్ఛిన్నమైనది.
రసభంగమైనది. కథావిచ్ఛిత్తి జరిగినది. కాని యిచ్చట
యుత్ప్రేక్షాలంకార వశమున ఆ విచ్ఛిత్తి జరుగలేదు. స్థూల
బుద్ధికి విచ్ఛిత్తి జరిగినదనిపించవచ్చును. సూక్ష్మబుద్ధికి
జరుగలేదు. రససాంతత్య పరమాభిజ్ఞతా లక్షణము
సూక్ష్మబుద్ధికి సంబంధించిన విషయము. ఉత్ప్రేక్షాలంకార
మెట్టిది? అన్యమైనదానియొక్క ధర్మము నన్యమైనదాని
ధర్మమునం దారోపించుట, వస్తువులకు సాదృశ్యము కాదు.
వస్తు ధర్మములయందు సాదృశ్యము, అతిలోహితాక్షియైన
శకుంతలయొక్క కుటిల భ్రూవులకును, కోపించినటువంటి మన్మ
థుని ధనుస్సునకుగల సాదృశ్యము కాదిచ్చట చెప్పినది. ఆ
భ్రూవులయొక్క భేదమునకు ధనుస్సుయొక్క భంగమునకు

సాదృశ్యము. ఇది మాత్ర మిచ్చట సరిపోవునా యని విచారింపదగియున్నది. స్మరునియొక్క శరాసనము విరువబడినదా యన్నట్లున్నది! ఎవరిచేత? ఎవరిచేతను లేదు. ఎవరిచేతనైన నైనచో నది శకుంతలచేత. మన్మథునియొక్క ధనుస్సును విరిచినది శకుంతల కావలయును. అతికోపముచేత ఆమెయే విరిచినదా యన్నట్లున్నది తాత్పర్యతః శకుంతల రాజునం దున్న వలపును తుడిచివేసినది. అతనియందలి భర్తృభావము వదలిపెట్టినది. అతనియందున్న తన శృంగారవాంఛను స్వస్తిచెప్పినది అని యర్థము రావలయును. అప్పుడును రసవిచ్ఛిత్తియే. అప్పుడును కథాభంగమే.

కాని ఆమె ప్రకటించినకోపము మన్మథుని ధనుస్సును విరిచినదా యన్నట్లున్నది; కాని నిజముగా విరువలేదు.

ఈ శ్లోక పూర్వార్థమునందు రాజుయొక్క యంతఃకరణ మనోవృత్తులయొక్క యేకత్రస్థితి జోడింపబడి యెట్లు రసవిచ్ఛిత్తి కాలేదో, ఉత్తరార్థమునందలి యామె కోప భ్రూభంగలక్షణము వర్ణించుటయందు కూడ నామె యందు సైతము రసవిచ్ఛిత్తి కలుగలేదు. ఆమెకు వచ్చిన కోప మెటువంటిదనగా, తన్ను నిరాకరింపగా వానియందలి వలపు కలిగి, వాని దుష్టత్వముచేత కోపించిన స్త్రీయొక్క లక్షణము గాని, "ఛీ వీనితో నాకేమిపని! వీనిని నేను పరిత్యజించితిని" అన్నట్టి లక్షణముకాదు, ఇచ్చట ఉత్ప్రేక్షాలంకారము వంది యర్థమంతయు నిండియున్నది. ఈ యొక్క శ్లోకముచేత కాళిదాసు పంచమాంకగత కథాస్రోతస్సుయొక్క మహోచ్ఛ్వ

రశ నిరూపించి, తన్నిరూపణమందు దుష్యంతుని యంతః
కరణము మేల్కొని యున్నదని నిరూపణచేయుట చేతను,
శకుంతలకు మిక్కిలి కోపము వచ్చెనుగాని, దానియందు
భర్తృభావమును త్యజించలేదనుటచేతను, పరమ విచిత్ర
ముగా రసభంగము కానీయకుండ, కథాభంగము కానీయ
కుండ రక్షించెను. పోషించెను.

ఇంతకోపము శకుంతలకు కలుగుట కేమి కారణము?
అంకాదినుండి ఆమెను తా నెరుగనన్నట్లే దుష్యంతుడు ప్రవ
ర్తించుచుండెనుగదా? నీవు నన్ను పెండ్లియాడితి వనగా
'శాంతం పాప' మన్నాడుగదా! అభిజ్ఞానము చూపింతుననగా
'ఆ మాట బాగున్న' దని యధిక్షేపించినాడుగదా! 'శ్రోతవ్య
మిదానీం సంవృత్తమ్' అని కూడ నెక్కిరించినాడు. 'శృణ్మ
స్తావత్' అన్నదానిలో కూడ వెక్కిరింపే యున్నది. 'అనార్య!
ఆత్మనో హృదయానుమానేన సర్వం పశ్యసి, క ఇదానీం
అన్యః, ధర్మకంచుక ప్రవేశినః తృణచ్ఛన్న కూపోపమస్య
తవానుకృతిం పశ్యతి।" 'అనార్యుడా! నీయొక్క హృదయము
నందలి అనుమానముచేతనే అంతయు చూచుచున్నావు. ధర్మ
మను చొక్కాయందు దూరినటువంటి, గడ్డిచేత కప్పబడిన
నూతితో పోలిక కలిగినటువంటి నీయొక్క అనుకృతిని ఇప్పు
డెవడు అన్యుడు చూచుచున్నాడు?' - అని సరిగా నామాటల
కర్థము. తాత్పర్యముగా 'నీవు ధర్మకంచుక ప్రవేశివి, తృణ
చ్ఛన్నకూపోపముడవు' అన్న మాటలతో శకుంతల దుష్యంతు
నోటా దెనసరించునే కాని జాగ్రత్తగా చూచినచో నచ్చుటి

కర్త 'అన్యః' - క్రియ 'పశ్యతి' - కర్మ 'అనుకృతి' - ఎవడు నీ యొక్క యనుకృతిని చూచుచున్నాడని యర్థము. అతని అనుకృతిని చూచుచున్నాడని యర్థము. అతని అనుకృతిని చూచుట యేమిటి? ఇచ్చట అనుకృతి యనగా, నిజముగా ధర్మిష్ఠుడైనవా డొకడున్నాడు. ఉన్నచో వానిని దుష్యంతు డనుకరించుచున్నాడు. అందుచేత దుష్యంతుడు ధర్మకంచుక ప్రవేశికాని ధర్మికాడు. నీ యనుకృతిని యెవడిక్కడ చూచు చున్నాడు? అనగా, నీవు చేసెడి యీ యన్యాయమును తెలిసినవా డిచ్చటలేడు. అని యర్థము కావచ్చును. నాకే తెలియును. నీకు కూడ తెలియునని యర్థము. నీకు కూడ తెలియుననగా శకుంతల నిస్సంశయముగా దుష్యంతునియొక్క యాథార్థ్యమును శంకించెను. అతడు తెలిసియే దాచుచున్నా డని యామె గట్టిగా నమ్మెను. అందుచేత నామెకంత కోపము వచ్చినది.

ఎందుకు శకుంతల అట్లనుకొనినది? ఎందుకనగా రాజు గౌతమితో 'అయి తాపస వృద్ధే'—

"స్త్రీణా మశిక్షిత పటుత్వ మమానుషీషు
సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః
ప్రాగంతరిక్షగమనాత్ స్వ మపత్యజాతం
అన్యై ర్ద్విజైః పరభృతాః ఖలు పోషయంతి"

ఈ మాటలన్నాడు. ఎవరితో నన్నాడు? శకుంతలతో కాదు, గౌతమితో. ముందర ఈ శ్లోకార్థమును విచారించి, గౌతమితో ననుటలోని గడుసుదనమును విచారింతము. 'స్త్రీల యొక్క అశిక్షితపటుత్వము అమానుషుల యందుగూడ కను

పించుచున్నది. ఎవరు ప్రతిబోధవతులో వారి విషయము చెప్పవలెను: అంతరిక్షగమనమునకు పూర్వము పరభృతలు తమ అపత్యజాతమునకు అన్యద్విజ పోషణము కలిగించు చున్నవి, ఇది లోకమునందు కనిపించుచున్నది. ఇది సామాన్యార్థము. ఇందులో నేటిరూ రయుక ప్రత్యేకార్థము శకుంతల కంత కోపము తెప్పించియుండవలయును. ఆ యర్థమేమిటి? 'అమానుషీషు' అనగా కోకిలను చెప్పికొని తిర్యగ్జంతువుల యందు అని యర్థము చెప్పికొనుచున్నారు. అమానుషీ యనగా అప్సరస్త్రీ యెందుకు కాకూడదు? అగుచున్నది. మానవ స్త్రీలు ప్రతిబోధవతులు, అనగా ఆలోచనచేతనో, శిక్షచేతనో, తెలిసికొనెడివారు. దేవతలో, పుట్టి పెరుగుట లేదు, పెరిగి పుట్టుచున్నారు. వారెప్పుడును పదియేండ్ల వారే భోగముకొఱకు జన్మమెత్తిరి. సహజముగానే వారి యందు భోగలక్షణము కలదు దానిపేరే అశిక్షితపటుత్వము అంతరిక్ష గమనమునకు పూర్వము అనగా మేనక శకుంతలను వదలిపెట్టి తనదారిని తా నాకాశమునపడిపోక పూర్వము. 'పరభృతాః' చెప్పిన కోకిలలని మన కర్థము. శకుంతలకో! తన తల్లియు తల్లివంటివారును. వారింద్రభృతలు. తమమీద తమ కధికారములేదు. ఋషుల తపస్సు భంగించుటకు దేవేంద్రుడు పంపినగాని కన్న బిడ్డలను స్వర్గమునకు తీసికొని రమ్మని గాదు. అందుచేత నీ పరభృతమైన మేనకగాని, ఋషులచేత సంతానము కన్న ఇతర అప్సరస్త్రీలుగాని, ఏమిచేయు చున్నారు? తా మొక ద్విజునియందీ సంతానమునని -విశ్వా

మిత్రిద లయుండు-ఇతర ద్విజులచేత - కణ్వాదులచేత- పోషింపజేయుచున్నారు. ఈ యర్థము శకుంతల మనస్సునకు తగులుట చాల సహజమైన విషయము. ఎవరు బాధపడు చుందురో, ఆ బాధ యెవరికిలన పడుచుందురో, వారి మాటల లోని గూఢార్థములు ఆ బాధ పడుచున్నవారికి తెలిసినంతగా ఇతరులకు తెలియవు.

ఇపుడు రాజు గడుసుదనము చూడవలయును. అతడీ మాటలు ముఖాముఖిగా శకుంతలతో చెప్పినచో ఆ మాటల లోని చురుకుదన ముండియుండదు. ప్రక్కవారితో చెప్పి నప్పటికి, నఖశిఖాపర్యంతము మండిపోవును ఇది కాళిదాసుని గడుసుదనము. పాపము! శకుంతల నిజముగా నమ్మినది. నిజముగా దుష్యంతు డబద్ధమాడుచున్నాడు. తెలిసి తన్ను వంచించుచున్నాడు, అందుకని ఆమెకంత కోపము వచ్చినది. కాని దుష్యంతుడు నిజముగా మఱచిపోయినాడు. ఆమె కోప ముచేత తత్పరిగ్రహ విషయమును స్మరించలేదు. కాని యతని మనస్సునకు సహజమైన పరిశీలనాదక్షతచే ఆమె యొక్క యాథార్థ్యమునందు విశ్వాసము కలవాడైనాడు. తరువాత శకుంతలను శార్ఙ్గరవుడు కోపించుట, తన్నుతిట్టుట, మొదలైనవన్నియు జరిగినవి. చివరకు శార్ఙ్గరవుడు 'పూర్వ వృత్త మన్యాసంగత్ విస్మృతో భవాన్ తత్కథమధర్మ భీరుః' అన్నాడు. 'ఇతర స్త్రీ సంగమమువలన పూర్వవృత్త మును మఱచిపోయితివి. నీ వధర్మభీరుడ వెట్లగుదువు?' అన్న శార్ఙ్గరవుని మాటలలో రాజు మఱచిపోయినాడని యున్నది.

నిస్సంశయముగా నున్నది. పాపము శార్ఙ్గరవుడు రాజు మఱచి పోయినాడని విశ్వసించెను. కాని యతడు మఱచిపోవుటకు కారణము మాత్రము లోకసామాన్యముగా నందరు నూహించు నట్లే యూహించినాడు. ఈమాట శార్ఙ్గరవు డనునంతకు రాజు నకు మఱికొంత సంకటము వచ్చినది. అపుడు పురోహితునితో—

"మూఢ స్స్యా మహ మేషా వా వదే న్మిథ్యేతి సంశయే
దారత్యాగీ భవా మ్యాహో పరస్త్రీ స్పర్శపాంసులః"

"నేను మూఢుడనగుచున్నానా? ఆమె యబద్ధమాడు చున్నదా? అని నేను సంశయపడుచున్నాను" అని చెప్పి నాడు. దీనికి కారణము శార్ఙ్గరవుడు నీవు మఱచిపోతివని గట్టిగా చెప్పుట.

ఈ యంకమంతయు నిర్దుష్టమైనది. కథా విచ్ఛిత్తి జరుగ లేదు. రసభంగము జరుగలేదు. అయినను ఆ మహాకవికి భయమే. ఈ అంకమునందలి చివరి శ్లోకము—

"కామంప్రత్యాదిష్టాం స్మరామి న
పరిగ్రహం మునేస్తనయాం,
బలవత్తు దూయమానం ప్రత్యాయ
యతీవ మే హృదయం"

"ఆమెను కాదన్నాను. ఆమెను భార్యయని నేను స్మరించలేకున్నాను. కాని నాగుండె బాధపడుచున్నది. ఈ బాధ నన్ను నమ్మించుచున్నదా యున్నట్లున్నది." ఈశ్లోకము చేతగూడ పూర్వమే విషయమును కాళిదాసు స్థాపించెనో దానినే స్థాపించుచున్నాడు. అంతఃకరణ మనస్సులయొక్క—

సహాస్థితిని నిరూపించుచున్నాడు. కొంచెము వెనుకకు పోయి నచో ప్రథమాంకము చివరగజమునువర్ణించుచు 'తీవ్రాఘాత ప్రతిహాత తరుస్కంధ లగ్నైకదంతః' మొదలైన శ్లోకమునకు వ్రాసిన వ్యాఖ్యానము చూచినచో నిచ్చట సమన్వయ పరచు కొనవచ్చును. 'పాదాకృష్ట' యన్న శబ్దములో పాదమనగా నంతఃకరణ చతుర్థభాగమని చెప్పబడినదిగదా! అంతఃకరణ చతుర్థభాగము మనస్సు. ఆ మనస్సేమన్నది? 'స్మరామి నపరి గ్రహం మునేస్తనయాం' అన్నది. అంతఃకరణ మైనటువంటి హృదయ మేమి చేయుచున్నది? 'ప్రత్యాయతి'– నమ్మించు చున్నది.

౧౧

ఈ విమర్శనము శాకుంతలమునందలి కాళిదాసుని శిల్పము దేనిచుట్టు తిరిగినదో, ఆ సత్పదార్థము దుష్యంతుని యం దెట్లు నిరూపింపబడినదో, తదేక వ్యాఖ్యానము. ప్రాస్తా వికముగా ఇతర విషయములు కొన్ని యుచ్చరింపబడినను ప్రధానముగా నిది సద్వ్యాఖ్య. తదితరములైన విషయములు చెప్పుటకు సంకల్పించనే లేదు. ఈ నద్విషయికవ్యాఖ్యపూర్వ వ్యాసముతోడనే పూర్తియైనది. కాని దానిలోని భాగము కాదన్నట్లుండి, దానిలోని భాగమైన యొక విషయము మిగి లినది. ఆ విషయము శాకుంతలము నందలి విదూషకుడు,

ఈ విదూషకుడు సృష్టి విలక్షణముగా నున్నది. ఇతడు దుష్యంతునియొక్క ద్వైధీభూతమైన మనస్సులో నొకఅంశ. మనస్సుకంటె భిన్నమైన అంతఃకరణమునకు దుష్యంతుడు లక్ష్యముగా, మనస్సునకు విదూషకుడు లక్ష్యముగా నీ నాటకమును కాళిదాసు నిర్మించినట్లు కనబడుచున్నది. మనస్సు చంచలమైనది. తదితరమైన యంతఃకరణము చంచలమైనది కాదు. ఈ నాటకమునందు ప్రధానమైనది శృంగారరసము. శృంగారరస సంబంధమైన మనశ్చాంచల్యమునకు విదూషకుడు లక్ష్యభూతుడుగా నిర్మింపబడినట్లు కనిపించుచున్నది. దుష్యంతుని కామము ధర్మకామము కాని అతడు బహు భార్యాతుడు. దక్షిణ నాయకుడు. ఎంత ధర్మకామమైనను దక్షిణనాయక గత శృంగారము చెడుపుచుండును. ఈ నాటకమునందు వసుమతి, హంసపదిక వీరిద్దరు కనిపించుచున్నారు. మూడవది శకుంతల. ఈ ముప్వురు నాయికల మధ్య దుష్యంతునియొక్క శృంగారభావము విభజింపబడుచున్నది. విదూషకుడు దుష్యంతుని మనస్సునకు పతాకగా నున్నాడనగా, ఆ మనస్సుకూడ ధర్మానుబంధియై దానికున్న చాంచల్యము ముప్వురి భార్యల నడుమ సంచరించుచున్న దుష్యంతుని మనస్సును ప్రతిబింబించుట.

ఇది యేడంకముల నాటకము. శృంగారరసప్రధానమైన నాటకము. నాల్గవయంకము మినహాయించినచో తక్కిన సర్వాంకములయందు రాజుయొక్క శృంగార లక్షణమున్నది. న్యాయముగా నీ యారంకములయందు విదూషకు డుండవలయును. అట్లు లేదు. ప్రథమసభాగమునందు లేదు. పంచ

ర్థాంకమునందు మొదటి పదిమాటలకు తప్ప లేడు. షష్ఠాం కమునందున్నాడు. సప్తమాంకమునందు లేడు. అనగా పంచ మాంకమునందు మొదట కొంచెము, మరిరెండు అంకముల యందును.

తొలుత పంచమాంకము మొదట విదూషకుని ప్రస్తావన గురించి విచారింతుము. పంచమాంక మీ నాటకమున కాయువుపట్టైనది. ఈ యంకములోననే శకుంతలా ప్రత్యాఖ్యానము జరిగినది. కథకీ యంకము నాభిభూతమైనది. ఈ యంకమునందు మొదటి తొమ్మిది వాక్యములలోని ప్రసంగ ములందు మాత్రమే విదూషకుడున్నాడు. ఆ ప్రసంగ మేమి? విదూషకు రాజుతో "సంగీత శాలాంతరమునందు శ్రద్ధవహిం చుము. కలశుద్ధగీతియందు స్వరయోగము వినబడుచున్నది. పూజ్యురాలైన హంసపదిక వర్ణపరిచయము చేయుచున్నది. హంసపదిక పాడిన గీతిక వినిపించినది. అందులోని యంతరా ర్థము నీకు తెలిసినదా?" అని యడిగినాడు. రాజు హంసపది కను సమాశ్వసించినట్టి మాటలు చెప్పుమని విదూషకుని పంపించి నాడు. విదూషకుడు వెళ్ళినాడు. ఇంతే కథ. ఇందులోని యర్థమేమి?

హంసపదిక పాడిన గీతి ఇది—

అభినవ మధులోలుప స్త్వం
తథా పరిచుంబ్య చూతమంజరీం
కమలవసతి మాత్ర నిర్వృతో
మధుకర! విస్మృతోఽస్యేనాం కథమ్.

"ఓయీ మధుకరా! నీవు అభినవ మధులోలుపుడవు. ఆ రీతిగా చూతమంజరి నట్లు మఱచిపోయితివి?" ఈ గీతిక సామాన్య కథాగతమై రాజుయొక్క దక్షిణ నాయకత్వమును నిరూపించుచున్నను, ప్రధానముగా రాబోవుకథను సూచించుచున్నది, ఈ యంకములోననే శకుంతలను వెంటబెట్టుకొని కణ్వశిష్యులు వత్తురు కదా! ఆ శకుంతల నితడు మఱచిపోయినట్లు నిరూపింపబడబోవుచున్నది గదా! దాని కిది సూచన. శకుంతలను మఱచిపోవుట యున్నది హంసపదికమీద పెట్టి ఇది వ్రాయబడినది. రాజుయొక్క విస్మృతి లక్షణ మిందు ప్రతిపాదింపబడినది. ఈవిస్మరణము తొలగించువాడెవడు? విదూషకుడు. ఇతడు రాజుయొక్క మనస్స్థానీయుడు. అందుకనియే తక్కిన యంకమునందు విదూషకుడు లేడు. రాజు శకుంతలను మఱచిపోయిన ఏతత్సంబంధమైన మనస్సు రాజునకు లేదు. ఆ మనస్సునకు పతాకాభూతుడైన విదూషకుడు లేడు. రాజు మఱచిపోవుటయు విదూషకుడు లేకపోవుటయు నొక్కటియే.

విదూషకుడు రాజుయొక్క మనస్సులో నేభాగమును ఆక్రమించుకొనుచున్నాడు? నాయికాప్రథమానురాగ తీవ్రతా లక్షణమున కతడు మూర్తి. మఱియు విప్రయోగకాలిక పరమతీవ్ర చింతనా లక్షణమున కతడు మూర్తి. అనగా రాజుయొక్క స్త్రీ సంబంధమైన భావనా లక్షణమునకు విదూషకుడు ప్రతిబింబముగా కనిపించుచున్నాడు. ద్వితీయాంక

ములో రాజు శకుంతలనుగూర్చి తీవ్రముగా నాలోచించెను. ఆ యాలోచన యంతయు రాజు విదూషకుల నడుమ ప్రశ్న సమాధానములుగా భాసించుచున్నదే కాని, శకుంతలా సంబంధ సంకల్ప వికల్పముల విస్తృతియే ద్వితీయాంకము. షష్ఠాంకము నందలి విదూషకుడు రాజుయొక్క తీవ్రవియోగ భావ చిహ్నము.

ఈ విదూషకునకు రాజునకు భేద మేమియు లేదు. మాతలి రాజునకు కోపము తెప్పించుటకు విదూషకుని హింసించినాడు. ఎందు కిట్లు చేసితివని రాజడుగగా, మాతలి ఇట్లనెను. 'ఎందుకో తెలియదుగాని, మనస్సంతాపమువలన మనోవైక్లబ్యము నీవు పొందినట్లు నేను చూచినాను. నిన్ను కోపింపజేయుట కిట్లు చేసినాను. ఎందుచేతననగా, కట్టెలు కదలించినగాని నిప్పు మండదు. కోపింపజేసినగాని పాము పడగ విప్పదు. క్షోభవలననగాని తన మహిమ పురుషుడు తాను తెలిసికొనలేడు.' ఈ యర్థమునకు లక్ష్యభూతమైన కోపము రాజునకు రావలయుననగా రాజు మనస్సు తీవ్రకోప మవలంబించవలయునన్నమాట. విదూషకుని పెట్టిన బాధ వలన రాజున కెంతో కోపమువచ్చునని యర్థము. ఎందుచేత రావలయును! కోపము వచ్చునది దేనికి! మనస్సునకు. మనస్స్థానీయుడైన విదూషకునియందు చేయబడిన యపకృతి మనస్సునకు కోపము వచ్చుటయే.

మరియు రాజు చపలుడు కాడు, సత్త్వరథుడు. సత్త్వ

రుషునియొక్క మనస్సు సంచలించినది. శకుంతలా విషయక విస్మృతి చాంచల్యము, మనోలక్షణము. ఇది సత్పురుషు డైన రాజున కెట్లుండును? కాని అతని మనస్సునకు చపల త్వమున్నదే! చపలత్వ మేకదేశ విషయము కావచ్చును. కాని యున్నది. రాజు నందుండుటకు వీలులేదే? అందుచేత రాజులో నొకభాగమై విదూషకుడా చపలుడు. రాజున కంటె వేరుగానున్నాడు. కాని రాజులో భాగమే. అందుకనియే "చపలోఽయం వటుః కదాచిదస్మత్ప్రార్థనా మంతఃపురేభ్యః కథయేత్" అన్నమాట.

ఈ రాజునకు విదూషకునకంతటి యవినాభావసంబంధ మున్నదా? అన్నచో ఉన్నది. దానిని కాళిదాసు చిత్ర విచిత్రముగా నిరూపించినాడు. పలు వాక్యములు దీని కుదాహరణములు కలవు. మఱియు గూఢార్థములు కలవానినే చూపింతును. తల్లి దగ్గరను విదూషకుని పొమ్మన్నప్పు డతడిట్లన్నాడు 'తేనహి యథా రాజానుజేన గంతవ్యం, తథా గమిష్యామి' అనుజు డన్న శబ్దమును తమ్ముడనియు వ్యుత్పత్త్యర్థముచేత అనుసరించి పుట్టినవాడనియు నర్థము. అనుసరించి పుట్టుటయనగా శృంగారరససంబంధమైన రాజుయొక్క మనోలక్షణము ననుసరించి పుట్టినవాడు.

అదియేమి చమత్కారమో, శకుంతలా ప్రస్తావన విదూషకునితో జరిగినగాని, విదూషకుడు శకుంతలను చూడనుకూడ లేదు. ఇది యాశ్చర్యము. విదూషకునియొక్క సంపూర్ణమైన స్వరూపము షష్ఠాంకమునందు ప్రపంచింపబడి

నది. రాజు విదూషకునితో నిట్లన్నాడు. 'ఓయీ ! ఇపుడు నేను శకుంతలా ప్రథమ వృత్తాంతమును స్మరించుచున్నాను. ఇది నీతో చెప్పినాను. నేను శకుంతలను తిరుగగొట్టినప్పుడు నీవు లేవు. పూర్వము నీతో నెపుడును కథలయందు నామె పేరే మెత్తలేదు నావలె నీవుకూడ మఱచిపోయితివా!' అని యడిగినాడు. విదూషకుడు 'నేను మఱచిపోలేదు. నీవంతయు చెప్పి, ఇది పరిహాస విజల్పిత మన్నావు. మృత్పిండబుద్ధిని నేనట్లే గ్రహించితిని.' అని విదూషకుడు సమాధానము చెప్పి తరువాత అన్నాడు గదా 'అథవా భవితవ్యతా బలవతీ'— దైవము బలమైనదన్నాడు, విదూషకుడు సేవకుడు. రాజు నాశ్వాసించవలసినవాడు. దైవము బలమైనది. మనమేమి చేయ గలుగుదుమన్న తాకత్తు నాకు కలదా—ఉన్నది. ఎందుచేత! రాజు మనస్సులో నత డేకదేశ మగుటచేత. అయినచో నతడు తాను మృత్పిండబుద్ధి నన్నాడు. మనస్సు వేఱు, బుద్ధివేఱు, మనస్సెప్పుడును బుద్ధికాదు. నిశ్చయాత్మక మైనది బుద్ధి. సంకల్ప వికల్పాత్మకమైనది మనస్సు. మనస్స్థానీయుడైనవాని విషయములో బుద్ధి ప్రస్తావన లేదు. అది మృత్పిండ సదృశము.

కాని యితడు రాజుయొక్క మనస్స్థానీయుడై యుండు టయేకాక వేఱొక పాత్రగా నిర్మింపబడినాడుకదా! నాటకమునందలి యేతత్కథాంశమునకు వెలిగా విదూషకు డొక పాత్రయే. ఆ పాత్ర దృష్ట్యా చూచినచో నతడు మృత్పిండ బుద్ధికాడు అతడు పరమవివేకి. ఎట్లనగా! మన స్సాక

వ్యక్తికుండును. ఆ వ్యక్తియొక్క సర్వలక్షణము మనస్సునందు ప్రతిబింబించుచుండును; ఆ వ్యక్తి సత్పురుషుడైనచో మనసునందొక నియమముండును. నియమము కలిగినను, మనస్సునకున్న చాంచల్యము మనస్సునకుండును. ఆ మనస్సునకున్న సదూహాలన్నియు దానికుండును. రాజుయొక్క మనస్సునకున్న దోషమొక్కటియే శకుంతలావిషయకవిస్మృతి! అంతమాత్రముచేత ఆ మనస్సు సత్పురుషుడైన రాజుయొక్క సర్వ సద్భావములను ప్రతిబింబించదా? ప్రతిబింబిచును. పూర్వ వ్యాసములలో రాజుయొక్క ఈ సత్తు తెలిసినవారిద్దరే యని చెప్పబడినది. రథచోదకుడు, విదూషకుడును. విదూషకున కెట్లు తెలియును అతడు రాజుమనస్సులో నేకదేశము ఎట్లు తెలియకుండనుండును! రథచోదకున కెట్లు తెలియును! ఈ నాటకములో రథమునగా నేమిదో పూర్వవ్యాసమునందు నిరూపింపబడినది. ఆ రథమును నడిపినవాడు కథాసూత్రధారుడు. కథను నడిపినవాడే వాడు. వాడు బ్రహ్మయొక్క స్థానీయుడు. అందుచేత వీరిద్దరే యుందురు.

విదూషకుడు సత్పురుషుడైన రాజుయొక్క మనస్సు. ఆ మనస్సునందు సర్వలక్షణము లవశ్యముగా నుండును విదూషకుడు మహామేధాశాలి. ప్రత్యాఖ్యానసమయ బాష్పకలుషితదృష్టిని శకుంతలను రాజు భావించినపుడు విదూషకు డిట్లన్నాడు—

"హా! అస్తిమే తర్కః
కేనాప్యాకాశచారిణా తత్ర భవ త్యపనీతేతి.

'ఎవడో యొక ఆకాశచారిచేత అప్సరాజ్ఞి తొలగింపబడినదని నేననుకొనుచున్నాను.' ఆమె తొలగింపబడుట చూచినవాడు పురోహితుడు, ఇతడు చూడలేదు. ఇతడువినను లేదు. ఇట్లూహించుచున్నాడు. ఆ మనస్సంత శక్తికలది. శాపవశమున విస్మృతి పొందినది. కాని, సహజముగా ఆ మనస్సునకున్న యాలోచనాశక్తియట్టిది.

ఈ యంకమును జాగ్రత్తగా చూచినచో, ప్రక్కన అదృశ్యరాలై యుండిన సానుమతియొక్క యూహలన్నియు విదూషకుడు ప్రశ్నించును. అనగా మంచి ఆలోచన గల మనస్సు లక్షణములు వానియందున్నవి.

రాజు ఉంగరము నధిక్షేపించుచుండగా విదూషకుడు "గృహీతో౽నేన పంథా ఉన్మత్తానాం!" ఈ మార్గము పిచ్చివారిది, పిచ్చివాడగా, మనస్సు చెడినవాడు. రాజు మనస్సు విదూషకుడే. అతడు సుస్థితిలోననే యున్నాడు. రాజుయొక్క ఉన్మాదమును తిరిగి తిరిగి వారించుచున్నాడు ఈ విదూషకుడు- అనగా రాజుయొక్క పరమవివేకమైన మనస్సు— లేనిచో రాజు ఉన్మత్తుడు కావలయును-విక్రమోర్వశీయము లోని రాజువలె. ఈ రాజు బ్రహ్మవేత్త. ఇతడు ఉన్మత్తుడు కాడు. రాజుంగరము నధిక్షేపించినాడు. మఱియు తన్ను తాను నిందించుకొన్నాడు. అపుడు విదూషకుడు తన మనస్సులో నిట్లనుకొన్నాడు. "ఆః! అహం ఖలు బుభుక్షయా ఖాదితవ్యో౽స్మి" నేనాకలిచేత తినబడ దగినవాడ నగుచున్నాను. అని యర్థము. దీని తాత్పర్యమేమి! దీని యర్థము వ్యాఖ్యాన వేళలయందు కావలయును గాని, లేనిచో లేదు. వ్యాఖ్యాన

మిట్లు చెప్పుచున్నది. "రాజు శకుంతలా విషయకమైన రిరంస కలిగియున్నాడు. ప్రక్కన యామె లేదు. అందుచేత రాజు నన్నే తినును. ప్రక్కన నింకెవ్వరు లేరు గనుక నన్నే శకుంతల ననుకొనునేమో!" అని యర్థమని వ్యాఖ్యానము. మరియు శ్రీనివాసాచార్యుడు "ఇతి పలాయనపరతా వ్యజ్యతే" అని వ్రాసినాడు. అని అచ్చటనుండి పారిపోవుదమని విదూషకు డూహించుట దీనిచేత గమ్యమాన మగుచున్నదని యర్థము. ఇంత చెప్పినను దీని తాత్పర్యము విస్పష్టముకాలేదు. లేనిచో నొక యేదో యసభ్యార్థ కల్పన చేయవలయును. అది అనిష్టాపత్తి. ఈ అనిష్టాపత్తి కలుగకుండుటకు, దీనియందలి వ్యంగ్యము—రాజుయొక్క మనస్సు పడుచున్న బాధయొక్క పరమస్వరూపమని చెప్పవలయును. మనస్థానీయుడైన విదూషకుడు కూడ లేచిపోవలయుననగా, రాజుయొక్క మనస్సు లేచిపోవుచున్నది. రాజు ఉన్మత్తుడగుచున్నాడనియెడి వ్యంగ్యమును తీసివేసినచో ఇచట అర్థమేమియు పొసగదు. ఈ వాక్యబలముచేత నిస్సంశయముగా విదూషకుడు దుష్యంత మనస్థానీయు డగుచున్నాడు.

సంస్కృత నాటకకర్తలు, నాటక మనగా నేమియని వారుద్దేశించిరో, ఉద్దేశించినట్లు కనబడునో, నాటకాంగములకంటె భిన్నములైన ఏ లక్షణములు వారి నాటకములయందు నాటకత్వ నిరూపణశక్తికలవో, విమర్శించుట—ఈ వ్యాసముల ఉద్దేశ్యము కాదు. కాని ప్రాస్తావికముగా రాజు గీసినబొమ్మను గురించి చెప్ప వలయును.

రాజు శకుంతలా రూపమును తా నెట్లు భావించెనో ద్వితీయాంకమునందు విదూషకునితో చెప్పెను.

"చిత్రే నివేశ్య పరికల్పిత సత్త్వయోగా
రూపోచ్చయేన విధినా మనసా కృతా ను"

'లోకమునందున్న సర్వసౌందర్యములు చిత్రమునందు పెట్టి సత్త్వయోగము కల్పింపబడినట్లున్నది.' రాజు చిత్రకారుడు. ఆమె రూపమును భావన చేసెను. అది షష్ఠాంకమునందలి విరహావస్థాసమయమున ప్రదర్శింపబడినది. ఆ చిత్రమును చూచి విదూషకుడు 'మధురావస్థా దర్శనీయో భావానుప్రవేశః స్ఖలతీవ మే దృష్టిర్నిమ్నోన్నత ప్రదేశేషు' అన్నాడు. ఆవదూతని సంగీతజ్ఞానము హంసపదికా గీతికా శ్రవణ సమయమున, చిత్రలేఖన కళా పరిజ్ఞాన మీ సమయమున వ్యక్తమగుచున్నది. అతడు బుద్ధిహీనుడు కాడు.

ఈ ముగ్ధులలో శకుంతల యెవరని యడిగినాడు. ఎవరు శకుంతల యని నీవనుకొను చున్నావని రాజడుగగా, ఈమెయై యుండవలెనని చెప్పుచున్నాడు. ఆ చెప్పుటలో సొగసున్నది. "ఏయమె జారుముడిలో ఎగసన త్రోయబడిన పూవులుగల జుత్తుతో, స్వేదబిందువులుగల ముఖముతో, చేతులు వినరుకొంచు, పాదులో నీళ్ళుపోయబడి లేత చివుళ్ళుగల మామిడి యొక్క దగ్గర కొద్దిగా బడలినట్లు చిత్రించబడినదో, ఆమె శకుంతల యనుకొనుచున్నాను"–అట్టి శకుంతలయందు రాజు లగ్నమనస్కుడు. ఆమెయే శకుంతల యని ఇతడనుకొను చున్నాడు. రాజుయొక్క ఊహకును వీని ఊహకును భేదమున్నట్లు లేదే!

మరియు ఆ జొన్నలో తుమ్మెదవచ్చి శకుంతల మొగముమీద వ్రాలుచున్నట్లు వ్రాయబడినది. ఇది పూర్వ కథ పూర్వమందు రాజేమన్నాడు? "అయం మాచరత్యవినయం ముగ్ధాసు తపస్వి కన్యాసు" అన్నాడు. అవినయ మాచరించుచున్నాడు. ఎప్పుడు? పౌరవే వసుమతీం శాసతి శాసితరి దుర్వినీతానాం" ఇచ్చట అవినయము, శాసనము-రెండు మాట లున్నవి. ఈ ఆరవయంకమున జొన్నలో నున్న తుమ్మెదను చూచి "ఏమయ్యా! ఆ పుణ్యురాలి ఎఱ్ఱకలువ పూరేకులవంటి వ్రేళ్ళతో. మొకమును కప్పుకొంచు భయపడినదానివలె ఉన్నది. ఈదాసీ పుత్రుడు-దుష్ట మధుకరము-ఆమె మొగముమీదికి లంఘించుచున్నాడు" అని విదూషకుడనగా "నివార్యతా మేవ దుష్టః" అన్నాడు. వానిని నివారించుమని యర్థము. దీనికి సమాధానము విదూషకుడు చెప్పినదిది. "భవానే వావినీతానాం శాస్తాస్య వారణే ప్రభవిష్యతి" నరిగా విదూషకునోట రాజునోట వచ్చిన అవినీతి శాసన శబ్దములు వచ్చినవి. ఇచటనున్నది రహస్యము. ఇట్టి పరమ రహస్యములైన యర్థ శబ్దముల నిక్షేపణములచేత కాళిదాసు విదూషకుని సృష్టిని ఈ వ్యాసమునందు చెప్పబడుచున్న యర్థమును మనసులో పెట్టుకొని చేసెననుకొనుటకు వీలున్నది. సర్వదా అట్లు కన్పించుచున్నది గదా! ఇది యిట్లుండగా ఆ యవినీతి రాజే శాసింపదగియుండుటయొక్క అర్హణ మును విచారించినయెడల నచట మధుకరము అని నియమము లేదు, శాసనము లేదు. దాని వెనుక నేదో యర్థమున్నదన్న